# ఆంధ్రపత్రిక

The Andhra Patrika - Madras  సంపుటం 44. సంచిక 99  FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO  బుధవారం 10-7-1957  Reg. No. M. 1118  6 పేజీలు 7 నయాపైసలు




# జిల్లాబోర్డులు వద్దని శాసనసభ కాంగ్రెసు సభ్యుల సూచన

## ప్రజలకు ప్రయోజనకరం కావని పలువురి అభిప్రాయం

### నియోజకవర్గ కాంగ్రెసు సంఘాలను కనుక్కోవాలని ముఖ్యమంత్రి నిర్ణయం

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాదు, జులై 9: జిల్లాబోర్డుల నిర్మాణంవల్ల ప్రజలకు అట్టే ప్రయోజనంలేదని, వాటిని తిరిగి యేర్పాటు చేయడం అనవసరమని, నిన్న సాయంత్రం శాసనసభ కాంగ్రెసుపార్టీ సమావేశంలో చాలామంది చెప్పారు. ఈ విషయంపై ప్రజల అభిప్రాయాన్ని, నియోజకవర్గ సంఘాల అభిప్రాయాన్ని సభ్యులు తెలుసుకోడానికి, అనంతరం ఒక నిర్ణయం చేయడానికి, నాయకుడు శ్రీ సంజీవరెడ్డి శాసనసభ కాంగ్రెసుపార్టీకి 15 రోజులు గడువు ఇచ్చారు.

ప్రత్యేకోద్యోగుల గడువు నవంబరు నాటికి పూర్తి అవుతుంది గనుక, ఆలోపలే ఎన్నికలు పూర్తిచేయాలనే ప్రతిపాదన సమావేశంలో చర్చకు వచ్చింది. దానిపై కొందరు సభ్యులు, యీ ఎన్నికలనిమిత్తం రు 25 లక్షలు వెచ్చించడం ప్రయోజనకరం గాదని, అసలు యీ సంస్థలు అధికారాలు లేకుండా నూ, ఖర్చుపెట్టడానికి తగినంత ఆదాయం లేకుండానూ ఉంటున్నవని, జిల్లాబోర్డులను రద్దుచేయాలని సూచించారు. పంచాయతీ సభ్యులనుండి పరోక్షపు ఎన్నికలు జరపాలని కొందరు చెప్పారు. ప్రత్యక్షపు ఎన్నికలు జరిపించి తరువాత జిల్లాలోని పెద్ద అధికార్లను ఉద్యోగరీత్యా జిల్లాబోర్డుల సభ్యులుగా చేసి, జిల్లాబోర్డులకు ఎక్కువ అధికారాలు దస్తే, ఎక్కువ ప్రయోజనం ఉంటుందని కొందరు అన్నారు.

ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి, ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, ప్రజల అవసరాలు తీర్చడానికి జిల్లాబోర్డులు తప్పక ఉండితీరాలని నిష్కర్షగా తమ అభిప్రాయాలు తెలియపర్చారు అని తెలిసింది. ...

---

**మద్యపాన వారసత్వం**

**కాపుసారా తయారీలో పిల్లలకు శిక్షణ**

అదిల్పూరు, జూలై 8: ఇక్కడికి పదిమైళ్ళలోని తంగడంచ గ్రామంపై, పాములపాడు సబ్-ఇన్‌స్పెక్టరు శ్రీ నారాయణస్వామి, సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ షేక్ మహబూబ్ షరీఫ్ ఈనెల 2-వ తేదీ సిబ్బందితో దాడిజరిపిన సందర్భంలో సారా నేరాల చరిత్రలో కొత్త ఘట్టం బయటపడింది. గతంలో అలవాటుపడ్డ పెద్దలేగాక, భావిసంతతికి కూడా ఈ నేరాలలో చోరవ కల్పించి, సారా తయారీలో నిష్ణాతులుగ తయారు చేస్తున్నారు. 13 సం||లు; 14 సం||లు యీడుగల ఇద్దరుబాలురు దొంగ సారా బట్టీలముందు కూర్చొని తయారుచేస్తూండగా పట్టుబడ్డారు. వారిదగ్గర 6 గాలన్ల సారా, 100 గాలన్ల ఊట పట్టుబడింది. ఈ బాలురు గత రెండు మూడు సంవత్సరాలుగా ఈ విద్య అభ్యసించి, నిపుణులయినారని తెలుస్తున్నది. వీరిని అరెస్టుచేశారు. (స్వ. వి.)

---

# 'ఆహార సమస్యల పరిష్కారానికి తక్షణ చర్యలు సూచించండి'

## మెహతా సంఘానికి జైన్ విజ్ఞప్తి

న్యూఢిల్లీ, జూలై 8: ఆహార విషయంలో యిప్పుడేర్పడ్డ గడ్డుపరిస్థితిని పరిష్కరించేందుకు తక్షణం కొన్ని చర్యలు సూచించవలసినదిగా కేంద్ర ఆహార, వ్యవసాయ శాఖా మంత్రి శ్రీ ఎ. పి. జైన్, ఆహారధాన్యాల ధరల విచారణ సంఘాన్ని కోరారు. ఈ సంఘానికి శ్రీ అశోక్ మెహతా అధ్యక్షులు. ...

---

## నెహ్రూ నెదర్లాండ్సు పర్యటన విశేషాలు

రేపు 3½ కు రేడియోలో ప్రసారం

---

## దక్షిణప్రాంతీయ మండలి సమావేశం

కళా వెంకట్రావు రాక

---

# ఇంకా ప్రజాస్వామ్య పద్ధతి అలవడలేదు

## ఆంధ్ర ఉద్యోగికి జరిమానా విధిస్తూ హైకోర్టు విచారం

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాదు, జులై 8: "ఈకోర్టు ధిక్కార నేరం ఏమీ తెలియని గ్రామస్థుడు చేసినదిగాదు; అనుభవజ్ఞుడైన ప్రభుత్వోద్యోగి చేసినది. హైకోర్టు ఆదేశాన్ని, ప్రభుత్వోద్యోగి, యీ విధంగా తృణీకరించినట్లు, మా అనుభవంలో మే మింతవరకూ చూడలేదు. ఇటువంటి పనికి మామూలుగా చట్టంప్రకారం జైలుశిక్ష విధించాలి. కాని యీయన ఐ. ఎ. ఎస్. కు చెందిన అనుభవజ్ఞుడైన ఉద్యోగిగాబట్టి, అధికార దర్పంతో కూడిన వ్యవస్థలో శిక్షణపొంది యింకా ప్రజాస్వామ్యపద్ధతులకు అలవాటుపడినట్లులేదు కనుక అటువంటి శిక్ష విధించడంలేదు" అని ఆంధ్రప్రదేశ్ న్యాయమూర్తులు హైదరాబాదు నగర కమీషనరుపై ఒక నేరాన్ని విచారించి తీర్పుచెప్పారు.

---

## హైదరాబాదు మేయరు

---

# అల్జీరియాలో నాప్లాం విషవాయువు ప్రయోగం

## ఫ్రాన్సుపై అల్జీరియా కార్మిక నాయకుని ఆరోపణ

ట్యూనిస్, జూలై 8: అల్జీరియాలో ఫ్రెంచి సైనికులు జాతీయ విప్లవకారులపై నాప్లాం, విషవాయువు ప్రయోగిస్తున్నట్లు అల్జీరియా కార్మిక నాయకుడు శ్రీ రషీద్ బిన్ అబుల్ అజీజ్ నేడు ఆరోపించారు.

స్వతంత్ర కార్మిక సంఘాల అంతర్జాతీయ సమాఖ్య సమావేశంలో ప్రసంగిస్తూ, అల్జీరియా ప్రతినిధి శ్రీ రషీద్ ఇలా అన్నారు: "ఇక్కడ ఉన్నవారు ఎవరు అయినా నామాటలు విశ్వసించలేకపోతే వారిని ట్యూనిస్‌లోని ఆస్పత్రులకు తీసుకొని వెళ్ళగలను. అక్కడ బాంబులు, విషవాయువులకు గురి అయిన వారికి చూడవచ్చును."

"స్వతంత్రులు కావడానికి అల్జీరియా ..."

... చేయాలని ఘనా ప్రతినిధి శ్రీ ఓమయర్ సూచించారు.

కొన్ని దేశాలు ఇతర దేశాలను దోచుకునే పద్ధతి శాంతికి భంగకరమైనదని కవ్యా ప్రతినిధి ఓభవాడా హెచ్చరించారు. "అణ్వస్త్రాని ఒక్కటే అపాయకరమైనది కాదని మనం విస్మరించకూడదు. వలస విధానం ఎప్పుడూ ప్రమాదకరమైనదే" అని కూడా ఆయన చెప్పారు.

కమ్యూనిస్టుచైనాతో వాణిజ్యంపై ఉన్న నిర్బంధాలు సడలించడాన్ని విమర్శిస్తూ, నూతన కాని ఆయుధాలు కాని సరఫరా చేయరాదని ఫార్మోజా ప్రతినిధి శ్రీ యాంగ్ యుంగ్ ఫ్రాంగ్ సూచించారు.

---

**ఊరిలో పెద్ద పులి: ఇళ్ళమీద పూళ్ళోవాళ్ళు**

---

## ఫ్రాన్సు అధ్యక్షుని ప్రకటన

---

# ప్రభుత్వాన్ని చేజిక్కించుకొనడానికి స్టాలిన్ అనుయాయుల కుట్ర

## కమ్యూనిస్టు కేంద్ర సంఘ జోక్యంమూలంగా విఫలమయిందని ఇటలీ పత్రిక కథనం

రోమ్, జూలై 8: ఇటీవల బర్తరఫ్ అయిన నలుగురు సోవియెట్ నాయకులు, తాము బర్తరఫ్ కావడానికి రెండు వారాలు ముందు, శ్రీ కృశ్చేవ్‌కు ఉద్వాసన చెప్పడానికి గట్టి ప్రయత్నం చేశారని, ఇటలీ కమ్యూనిస్టు వార్తాపత్రిక 'యూనిటా' మాస్కో విలేఖరి ఈరోజున ప్రకటించారు.

లెనిన్‌గ్రాడ్ నగరం 250 వ వార్షిక దినోత్సవాల సందర్భంలో నిన్న, మొన్న చేయవలసియున్న ప్రసంగాలు గురించి చర్చించే నిమిత్తం సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షమండలి అసాధారణ సమావేశం వెంటనే ఏర్పాటు చేయాలని శ్రీ యుమలెంకోవ్, మొలటోవ్, కగనోవిచ్ జూన్ 17 వ తేదీని కాని 18 వ తేదీని కాని కోరినట్లు ఈ విలేఖరి తెలియపరచారు.

అధ్యక్ష మండలి సభ్యులలో ముగ్గురు ...

ఏమీ లేదని 'పార్టీకి వ్యతిరేకులు అయిన' ఆ నాయకులు సమాధానం ఇచ్చారు. అయినా తమ ప్రతిపాదనపై అధ్యక్ష మండలిలో వెంటనే నిర్ణయం జరగాలని, ఆనిర్ణయాన్ని వెంటనే పత్రికలలోను, రేడియో ద్వారాను ప్రకటించాలని వారు కోరారు.

అధ్యక్ష మండలి నిర్ణయంతో పాటుగా పత్రికలలోను, రేడియో ద్వారాను పార్టీ రాజకీయ విధానం ...

"కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సంఘం మాత్రమే ఈ సమస్యను పరిష్కరించాలని కృశ్చేవ్‌ను బలపరిచే నాయకులు వాదించారు.

### 'వెంటనే నిర్ణయం జరగాలని పట్టు'

కేంద్రసంఘం అంటే తమకు భయం ... కొందరు చెప్పారు.

"లోపలికి రావడానికి అనుమతికొరకు నిరీక్షిస్తూ బయట వేచియున్న కేంద్ర సంఘసభ్యులు రాజకీయ విధానం సంబంధించినంతవరకు పార్టీకి బాధ్యత వహించవలసినది కేంద్రసంఘమేనని, అందువల్ల దానిపై జరిగే నిర్ణయాలలో తాము పాల్గొనకుండా చేయడానికి

(6 వ పుట చూడుడు)

# అభివృద్ధి కార్యక్రమాలకు కొత్తపన్నులు అవసరం

## శాసనసభలో చెన్నారెడ్డి సూచన

## మంత్రులపై ముఠా రాజకీయాల ప్రాబల్యం లేదని లచ్చన్నకు ముఖ్యమంత్రి జవాబు

['ఆంధ్రపత్రిక' ప్రతినిధి]

హైదరాబాదు, జూలై 8: అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకుగాను కొత్తపన్నులు విధించడానికి ఆర్థికశాఖ మంత్రి సంకోచించరాదని డాక్టర్ మర్రి చెన్నారెడ్డి ఈ రోజున ఆంధ్రప్రదేశ్ శాసనసభలో సూచించారు.

మంత్రులు ముఠా రాజకీయాల ప్రాబల్యానికి లోనవుతున్నారని, మాజీమంత్రి శ్రీ లచ్చన్న ఆరోపించగా, ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ఆ ఆరోపణ నిజంకాదని చెబుతూ, ఏదైనా దృష్టాంతం చూపితే చర్య తీసుకోడానికి వెనకాడను అని హామీ ఇచ్చారు. పరిపాలనలో ముఠా రాజకీయాలకు తావులేకుండా చేయాలనే ప్రభుత్వ తాపత్రయం అని ముఖ్యమంత్రి అన్నారు.

ఇవాళటి చర్చలో పదకొండుగురు కాంగ్రెసు సభ్యులు, ముగ్గురు కమ్యూనిస్టు, ఇద్దరు సోషలిస్టులు, సేవనలిస్టు పార్టీవారొకరు పాల్గొన్నారు.

ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డి బుధవారంనాడు చర్చకు సమాధానమిస్తారు.

శ్రీ చెన్నారెడ్డి ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల ఆదాయవ్యయాలు ఒకొంతవరకు వేరేరుగా చూపే పద్ధతిని ఆయన సమర్థించారు.

"ఆంధ్ర ప్రదేశ్‌కు, తెలంగాణ ప్రాంతం గుదిబండ కాగలదనే భయం కొందరు సభ్యులు వెలిబుచ్చారని సూచిస్తూ, అట్టి భయానికి ఆస్కారం లేదని, అభివృద్ధి అవసరాల నిమిత్తం కొత్త పన్నులు విధించడానికి సంకోచించరాదని డాక్టర్ చెన్నారెడ్డి చెప్పారు.

ఈ రోజున శాసనసభలో 1957-58 బడ్జెటుపై చర్చ ప్రారంభిస్తూ, డాక్టర్ చెన్నారెడ్డి ఇంకా ఇలా చెప్పారు.

"ఆర్థిక శాఖామంత్రి రాష్ట్రంలోని ఆర్థిక పరిస్థితులు వివరించారు. కాని ఆర్థికంగా ఉన్న చిక్కులు తొలగించడానికి సూచనలు ఏమీ చేయలేదు. రాష్ట్ర ప్రజలకు ఈ పథ దారి చూపవలసి ఉన్నది. కాని మంత్రి నేడు దేశంలో సాధారణంగా ఉన్న నిస్పృహ నాసే వెలిబుచ్చుతూ విషాద గాథగా ప్రసంగించడం సమంజసం కాదు. సర్వతోముఖంగా దేశాన్ని అభివృద్ధి పరచడానికి పెద్ద ఎత్తున ప్రణాళికలు అమలుపరచుతున్నప్పుడు అయిదు కోట్ల రూపాయలకు విచారపడవలసిన పని లేదు.

### తెలంగాణ 'గుదిబండ'

"ఆంధ్ర తెలంగాణ ప్రాంతాల ఆదాయవ్యయాలు వేర్వేరుగా చూపుతున్నందుకు కొందరు మిత్రులు అభ్యంతరం చూపుతున్నారు. దీనివల్ల ఏదో ప్రమాదం ఏర్పడుతుందని కూడా బెదిరిస్తున్నారు. ఇది సరిఅయిన ధోరణి కాదు. వాస్తవాన్ని నిర్లక్ష్యం చేయడం కూడా అవుతుంది. అంతే విభేదాలు శాశ్వతంగా ఉండిపోవాలని నా ఉద్దేశం కాదు. తెలంగాణ ఎప్పటికీ ఇలా వెనుకపడే ఉంటుందేమో, కొంతకాలానికి ఆంధ్రప్రదేశ్‌కు గుదిబండ అవుతుందేమోనని కొందరు అంటున్నారు. అది నిరాధారమైన భావన. తెలంగాణ ఆర్థిక స్థితి తృప్తికరంగానే ఉన్నది. అయితే ఈ ప్రాంతం అభివృద్ధి పరచడంలో యుద్ధానికి అవసరమైనంత వేగిరపాటు చూపవలసి ఉన్నది.

"ప్రభుత్వ యంత్రాంగం దాదాపు పూర్వం వలెనే ఉంటున్నది. అది అలాగే ఉంటే ఇకముందు మన అభివృద్ధి సాధ్యం కాదు. నివేదికలు పంపితే చాలనుకొనే అధికారులు ఉన్నంత కాలం సమాజ వికాసం జరగడం కల్ల.

"పన్నులు వ్యతిరేకించడం అనవసరం. పెద్ద వ్యాపారం చేసే వారిపైనా, ఇంకా ఎన్నో విధాల ధనార్జన చేసేవారిపైనా పన్నులు విధించడానికి మన ప్రభుత్వాలు సంకోచించవలసిన పనిలేదు.

### సలహాసంఘం నియామకం

"రాష్ట్ర ఆర్థికపరిస్థితి చక్కబరచేందుకు సభలోని అన్ని పక్షాలకు ప్రాతినిధ్యం కలిగిన ఒక సంఘం నియమించాలని శ్రీ సుందరయ్య చేసిన సూచన సమంజసంగా ఉన్నది. ఈ విషయమై మంత్రివర్గం ఆలోచించడం అవసరం.

"రెవిన్యూబోర్డును విచ్ఛిన్నం చేసి రెవిన్యూ కమిషనర్లను నియమించవలసి ఉన్నది. పరిపాలన వికేంద్రీకరించకపోతే ఈరోజులలో అభివృద్ధి సాధ్యం కాదు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిని అభివృద్ధిశాఖ కమీషనరుగా నియమించడమన్నది అర్థం లేని పని మరొకటి లేదు.

"ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలకు చెందిన ఉద్యోగులను ఐక్యపరచడం సక్రమంగా జరగనందున పరిపాలనా వ్యవస్థలో సమర్థత కుంటుపడుతున్నది.

"ప్రభుత్వం ధైర్యం వహించి జతి పంతుల్ని, నాన్ గెజెటెడ్ ఉద్యోగుల సమస్యలు పురస్కరించడానికి పూనుకోవలసి ఉన్నది.

"ఆహార ధరలు పెరిగిపోతున్నవి. వాటితోపాటు 'సూపర్ ఫాస్ఫేట్' ధరకూడా 28 రూపాయలనుంచి 32 రూపాయలకు పెరిగినది. వ్యవసాయానికి అవసరమైన ఎరువులు మున్నగునవి న్యాయమైన ధరలకు లభించేటట్లు చేయకుండానే ఆహార ధాన్యాల ధరలు మాత్రం 'కంట్రోలు' చేయ పూనుకోవడం న్యాయం కాదు. ఈవిషయంలో వ్యవసాయ మంత్రి ధోరణి సరిఅయిన దేవని పిస్తున్నది.

ప్రతి గ్రామంలోనూ ఆ గ్రామ అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వము కొంత గ్రాంటుగా యిచ్చి, గ్రామస్థులనుండి అంతకు సమానమైన మొత్తం వసూలుచేసి ఒకనిధి యేర్పాటు చేయాలని, అప్పుడే జాతీయ విస్తరణ, సమాజ వికాసకార్యక్రమాలలో ప్రజలు ఉత్సాహంగా పాల్గొంటారని డా. చెన్నారెడ్డి సూచించారు.

### గ్రామాల అభివృద్ధి నిధి

"గ్రామాల అభివృద్ధికోరకు గ్రామ పంచాయతీల ద్వారా కాని, జిల్లాబోర్డుల ద్వారా కాని 'గ్రామాభివృద్ధిపన్ను' వసూలుచేయడం అవశ్యకం. అట్టిపన్ను నూటికి 7 రవంతులు వసూలు అయిన గ్రామంలోనే వెచ్చించడం కూడా అవసరం. శ్రమదానం రూపంగా ప్రజల సహాయం పొందవచ్చు. సహకారపద్ధతిపై విద్యాభివృద్ధికి కృషి జరిగే ఏర్పాటు చేయవలసి ఉన్నది.

### చలనచిత్ర పరిశ్రమ

"ఆంధ్ర చలనచిత్ర పరిశ్రమ ఇప్పటికీకూడా మద్రాసులోనే ఉండడం దురదృష్టం. మన రాజధానిలో యీ పరిశ్రమ అభివృద్ధి అయ్యేటట్లు చూడడం అవసరం. ఇందువల్ల కళ అభివృద్ధిమాత్రమే కాక ఆర్థికంగా కూడా లాభిస్తుంది.

"గ్రామాలలో చేతబడివంటి దురాచారాలు నిర్మూలించడానికి పోలీసు శాఖ తత్పరత వహించవలసి ఉన్నది. లంచగొండితనం నిర్మూలనకు ఇతోధికముగా కృషిచేయడం అవసరం. చిన్న పట్టణాల అభివృద్ధి ముఖ్యం. మత్స్య పరిశ్రమ పెంపొందించితే ప్రభుత్వానికి ఆదాయం అధికం అవుతుంది. పొదుపుచేసే ప్రయత్నం గవర్నరుకు అయ్యే ఖర్చు మొదలుకొని అన్నిటిలోనూ చేయవలసి ఉన్నది. గవర్నరు పదవి, దానికిఅయ్యే ఖర్చు మనగౌరవం సూచిస్తుందనడం పొరపాటు. అది 18వ శతాబ్దానికి చిహ్నం.

### మంత్రులపై ముఠా రాజకీయాల ప్రాబల్యం

శ్రీ గౌతు లచ్చన్న మాట్లాడుతూ, ముఠా రాజకీయాల ప్రాబల్యానికి మంత్రులు లోనవుతున్నారని, యిది రాష్ట్రానికి శుభసూచన కాదని ఆరోపించారు.

ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు యీ ఆరోపణలో నిజం లేదన్నారు. ఏదైనా దృష్టాంతం లేవనుచూపితే, పరిస్థితులను చక్కదిద్దడానికి వెనకాడనని హామీ ఇచ్చారు. పరిపాలనలో ముఠా రాజకీయాలు లేకుండా చేయాలనేదని తన అభిలాష అన్నారు.

"పరిపాలన ముఠా తత్వంతో మితిమీరి పోయింది. మంత్రులకు సన్మానాలు చేద్దామనుకుంటే, ఫలానావారిని కలుసుకోమని మంత్రి బ్రహ్మానందరెడ్డిగారు తెలిపిఇచ్చారు" అని శ్రీ లచ్చన్న అన్నారు.

బ్రహ్మానందరెడ్డి: నేనా గ్రామానికి పోయి సన్మానం అందుకున్నాను.

లచ్చన్న: సన్మానం పొందలేదని లేదు. లంతి ఇవ్వలేదా.

ప్రగడ కోటయ్య: లచ్చన్నగారు మంత్రిగా ఉన్నప్పుడుకూడా ఇలాగే చేశారు.

సభాపతి: మీరు కూర్చోండి. ఇవన్నీ పార్టీ సమావేశములో చెప్పుకోవలసినవే కాని, ఇక్కడ పరస్పరనిందారోపణ చేసుకోకూడదు.

ముఖ్యమంత్రి: ఇలాంటివి జరిగితే తగుచర్య తీసుకొంటాము. దుర్మార్గముగా వ్యవహరించాలని మా ప్రభుత్వ ఉద్దేశ్యము కాదు.

లచ్చన్న: ఇప్పటికే ముఖ్యమంత్రి అలా హామీ ఇచ్చినందుకు అభివందనాలు.

తరువాత శ్రీ లచ్చన్న రైతుల ఇబ్బందుల సంగతి చెబుతూ "గ్రామాలలో పరిస్థితి క్షీణిస్తోంది. పంటలు పడితే శిస్తు మినహాయింపు ఇవ్వడంలేదు. పంటనీరు సమయానికి సరఫరా చేయకపోయినా, నీటితీర్వ మాత్రం వసూలుచేస్తున్నారు. పూర్వం కట్టిన పాఠశాల భవనాలు, రోడ్లు, చెరువులు మరమ్మతు లేకుండా, నిరుపయోగంగా పడిఉన్నాయి" అన్నారు.

### స్కూల్‌ఫైనల్‌దాకా ఉచిత విద్య

జీతాలు కట్టి చదువుచెప్పించుకోలేని పేదవాళ్ల పిల్లలకు స్కూలు ఫైనల్ దాకా ఉచితంగా విద్య చెప్పాలని శ్రీ లచ్చన్న అడిగారు.

వెనుకబడిన జాతులవారిని, నిమ్న తరగతులవారిని, ఉద్యోగాలలోకి తీసుకొనేందుకు, యిప్పుడనుసరిస్తున్న పద్ధతి వల్ల వారికి చాలా ఇబ్బందిగా ఉన్నదని, వెనుకబడిన జాతులవారికి ప్రత్యేకించిన ఉద్యోగాలకు, అర్హత గలిగిన వారు దొరకకపోతే ఆ ఉద్యోగాలను, నిమ్న తరగతులవారికి ఇవ్వాలని, అదేవిధంగా నిమ్నతరగతులకు ప్రత్యేకించిన ఉద్యోగాలు అర్హత గలిగినవారు దొరకకపోతే, వాటిని వెనుకబడిన జాతులవారికివ్వాలని ఆయన సూచించారు.

సహకారకేంద్ర బ్యాంకుల్లో ముఠాతత్వాలు కారణంగా, అధికారులు జోక్యం కల్పించుకొని వాటిని రద్దుచేసి వేస్తున్నారని, శ్రీకాకుళం కేంద్ర సహకార బ్యాంకులు ఎన్నికలు జరిపిస్తే, 'రిట్' ఉపసంహరించుకొంటామన్నా ప్రభుత్వం ఏ హామీ ఇవ్వలేదని శ్రీ లచ్చన్న ఫిర్యాదు చేశారు.

శ్రీ సి. హెచ్. రాజేశ్వరరావు (పి. డి. ఎఫ్.) రాష్ట్రమంతటా భూసంస్కరణలు అమలు జరపాలని ఆహార ధాన్యాల ధరలు తగ్గించడానికి చర్య తీసుకోవాలని ప్రభుత్వాన్ని కోరారు.

### నిర్బంధంగా పొదుపు చేయించాలి

శ్రీ ఎం. ఎస్. రాజలింగం (కాంగ్రెసు) నెలకు రు 150 పైగా ఆదాయం వచ్చే వారందరూ నూటికి రు 2 లు విధిగా పొదుపుచేసే, పథకమేదైనా ఆలోచించి అమలు జరపాలని సూచించారు.

ఆంధ్ర ప్రాంతంలోకన్నా, తెలంగాణాలో తల 1 కి సగటు ఆదాయం చాలా తక్కువ అని, వెనుకబడిన యీ ప్రాంతాన్ని మిగతా ప్రాంతాలతో సరితూగే స్థితికి తీసుకొని రావాలని కోరారు. ఆంధ్ర తెలంగాణాలలో అమ్మకంపన్ను చట్టాలను సమన్వయం చేసి, రాష్ట్ర మంతటికీ ఒక చట్టం ఏర్పాటు చేసినందువల్ల, తెలంగాణాలో పన్ను రేటు పెరిగిందని, అమ్మకంపన్ను భూమిశిస్తు తెలంగాణాలోనే ఎక్కువ అని అన్నారు. ఆంధ్రలోకూడా వ్యవసాయంపైన పన్ను వేస్తే బాగుంటుందన్నారు.

జంటనగరాలపై ఖర్చు, తెలంగాణాపై ఖర్చుగా చూపించరాదని, హైదరాబాదు, రాజధానిగాబట్టి, దానిపై ఖర్చు రాష్ట్ర మంతటికీ చెందుతుందని శ్రీ రాజలింగం అన్నారు.

శ్రీ కె. వి. ఎస్. పద్మనాభరాజు (సో) గ్రామాలలో విద్యావైద్య సౌకర్యాలు ఎక్కువ చేయాలని కోరారు.

శ్రీ కొత్తూరు శీతయ్యగుప్త (కాం) రాష్ట్రం భాగపడాలంటే, తెలంగాణ, ఆంధ్ర అనే వివక్షత పోవాలని హెచ్చరించారు. శ్రీ బి. వి. సుబ్బారెడ్డి (స్వ) దుబారా తగ్గించడానికి ప్రభుత్వంచర్యతీసుకోవాలని అన్నారు. రవాణాను జాతీయం చేయాలని కోరారు.

శ్రీ కె. రామచంద్రారెడ్డి (పి. డి. ఎఫ్) పరిపాలనా ఖర్చులు బాగా తగ్గించినట్లయితే ఆయవ్యయాలలో లోటు పూడ్చవచ్చునని, నిజాంకు జాగీర్దార్లకు యిచ్చే పరిహారం కొంతకాలంపాటు వాయిదా వేయాలని సూచించారు.

శ్రీ సాగి సూర్యనారాయణరాజు (కాం) ప్రభుత్వ నిర్ణయాలను, అధికారులు సకాలంలో, సక్రమంగా అమలు జరిపేట్లు చూడాలన్నారు.

శ్రీ కె. జనార్దనరెడ్డి (కాం) ప్రభుత్వం వసూలుచేస్తున్న పన్నులు తమ అభివృద్ధికే ఖర్చుచేస్తారన్న నమ్మకం ప్రజలలో కలిగేట్లు చూడాలన్నారు.

ఆయవ్యయ అంచనాలలో తెలంగాణ లోటును నొక్కి చెబుతున్నట్లు కన్పిస్తున్నవి. రాజధానివంటి విలువైన ఆస్తులను, తెలంగాణ సమకూర్చిపెట్టిందన్న సంగతి మరచిపోరాదు" అని ఆయన అన్నారు.

శ్రీ కాకాని వెంకటరత్నం (కాం) పబ్లిక్ వర్క్సు, రెవిన్యూ శాఖలలో ఖర్చు తగ్గించడానికి కావలసినంత వీలున్నదన్నారు.

శ్రీ ఎం. నాగిరెడ్డి (కమ్యూ) దేశంలో సామ్యవాదవ్యవస్థ నెలకొల్పాలని నిజంగా కాంగ్రెసు ప్రభుత్వానికి ఉంటే, భూసంస్కరణలవంటి చర్యలు కొన్ని ముందు అమలు జరపడం అవసరమని చెప్పారు.

దేవాలయాల నిర్వహణను ప్రభుత్వం వశంచేసుకోవాలని, యిందువల్ల సాలీనా రు 2 కోట్లు అదనంగా ఆదాయం వస్తుందని శ్రీ ఎ. వెంకటరామయ్య (కాం) సూచించారు.

శ్రీ టి. అంజయ్య (కాం) నిజాంకు భరణము, జాగీర్దార్లకు పరిహారము అపుచేయాలని చెప్పారు. స్వాతంత్ర్యం వచ్చి పదేళ్ళయినా, రైతులకు, కార్మికులకు జరిగిన దేమాత్రమూ లేదని విమర్శించారు.

శ్రీ అదినారాయణ (సో) ప్రభుత్వం చిన్న నీటిపనుల నిర్మాణం ప్రారంభించాలని, గ్రామప్రాంతాలలో రాకపోకలసౌకర్యాలు మెరుగుపర్చాలనికోరారు.

శ్రీ వంటూరి శ్రీనివాసరావు (కాం) ప్రజల కోర్కెలు ఎన్నో రెట్లు పెరిగాయి; ప్రజలు, ప్రభుత్వము కలిసి సమష్టిగా కృషిచేస్తేగాని ఇవి తీరవు అన్నారు. సర్వత్రా పొదుపుకు కృషి జరగాలని సూచించారు.

# రాజకీయ బాధితుల భూముల పంపిణీ

## ఆగస్టు 15 లోగా పూర్తి అవుతుందని ప్రకటన

['ఆంధ్రపత్రిక' ప్రతినిధి]

హైదరాబాదు, జూలై 9: "రాజకీయ బాధితులకు భూములను పంపిణీచేసే వ్యవహారం ఆగస్టు 15 వ తేదీలోగా పూర్తిఅవుతుంది. రాజకీయ బాధితులకు భూములు ఇస్తామని ప్రకటనచేసి అప్పటికి పది సంవత్సరాలవుతుంది. కనుక ఆగస్టు 15 నాటికి ఈ సమస్య పూర్తిగా పరిష్కారం కావలసిందే" అని రెవెన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు చెప్పారు.

శ్రీకాకుళం, విశాఖపట్టణం, చిత్తూరు, కడపజిల్లాలలో ఇంకా దాదాపు 200 దరఖాస్తులు పరిష్కారం కావలసివున్నది. ఆగస్టు 15వ తేదీలోగా వాటిని పరిష్కారం చేస్తామనీ శ్రీ కళా వెంకటరావు అన్నారు. ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, అనంతపురం జిల్లాలలో ఈ వ్యవహారం దాదాపు పరిష్కారమైందనీ, ఇంకా దరఖాస్తులేమైనా మిగిలిఉంటే వాటిని ఫలానా గడువులోగా పరిష్కారం చేయాలని ఆయాజిల్లాల అధికారులను కోరామని కూడా రెవెన్యూమంత్రి వివరించారు.

### భూమిసంస్కరణలు

భూమి సంస్కరణలు ఎంత త్వరగా అమలులోకివస్తవనే సమస్య కాంగ్రెసు పక్షంమీదా, శాసనసభమీదా ఆధారపడి ఉంటుందని రెవెన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు అన్నారు.

ఇవాళ మధ్యాహ్నం ఇక్కడినుంచి మదరాసుకు రెవెన్యూమంత్రి వెళ్లారు.

మదరాసురాష్ట్రంలో అమలు జరుపనున్న భూమి సంస్కరణల సమస్యపై మదరాసు రెవెన్యూమంత్రితో ఆంధ్రప్రదేశ్ రెవెన్యూమంత్రి సమాలోచనలు జరుపుతారు.

ప్లానింగ్ కమిషన్ సిఫార్సులనూ, తెలంగాణాలో అమలు జరిగిన భూమి సంస్కరణలనూ దృష్టిలో పెట్టుకుని తయారుచేసిన భూమి సంస్కరణల ప్రతిపాదనలను గురించి ముఖ్యమంత్రితో శ్రీ వెంకటరావు సమాలోచనలు జరిపారు. ఆ ప్రతిపాదనలను గురించి మంత్రివర్గం త్వరలో ఒకనిర్ణయం చేస్తుంది.

## మహారాష్ట్ర ప్రజా సోషలిస్టుల వైఖరి

### జాతీయ కార్యవర్గం చర్చ

న్యూఢిల్లీ, జూలై 8: సంయుక్త మహారాష్ట్ర సమితి తరఫున బొంబాయి శాసన సభకు ఎన్నికైన ప్రజాసోషలిస్టు అభ్యర్థులు శాసనసభలో విడిగా వ్యవహరించాలని పార్టీ జాతీయ కార్యవర్గం ఇచ్చిన ఆదేశానికి మహారాష్ట్ర శాఖ నిర్ణయం విరుద్ధంగా వున్నందున యీ విషయంగురించి కార్యవర్గం ప్రత్యేకంగా యీ సారి సమావేశంలో చర్చిస్తుంది. ఈ సమావేశం ఎల్లుండి నుంచి మూడురోజులపాటు జరుగుతుంది.

బొంబాయి రాజధానిగా సంయుక్త మహారాష్ట్రం ఏర్పాటుకు జరిగిన ప్రజాందోళనను పురస్కరించుకుని ప్రజా సోషలిస్టు సభ్యులు సమితిలో చేరి ఎన్నికైనారని, ఇప్పుడు విడిపోవడం భావ్యం కాదని, మహారాష్ట్రశాఖ కేంద్ర కార్యవర్గానికి విజ్ఞప్తి చేసింది. ఇలాచేస్తే సమితి విచ్ఛిన్నమవుతుందని కూడా శాసనసభ ప్రతిపక్ష నాయకుడు మహారాష్ట్ర పి. యస్. పి. నాయకుడు శ్రీ యస్. యం. జోషి తమ అభిప్రాయాన్ని పునరుద్ఘాటించారు.

సమితినుంచి విడిపోరాదని పి. యస్. పి. శాసన సభ్యులు కూడా ఇటీవల ఒక నిరయం చేశారట. జాతీయ కార్యవర్గానికి మహారాష్ట్ర శాఖకు శ్రీ హెచ్. వి. కామత్ రాయబారాలు సాగిస్తున్నారన్న వార్త తమకు తెలియదని పార్టీ ప్రతినిధి ఒకరు చెప్పారు. పార్టీ ఐక్యత కాపాడాలని అందరు కృత నిశ్చయులై వున్నారని పార్టీ కార్యదర్శి శ్రీ త్రిలోకీ సింగ్ అన్నారు.

కామన్వెల్తు దేశాల కార్మిక, సోషలిస్టు పక్షాలు ఒక సమాఖ్యగా ఏర్పడాలని బ్రిటిష్ కార్మిక పక్షం ఇచ్చిన ఆహ్వానాన్ని గురించి కూడా కార్యవర్గం వచ్చే సమావేశంలో చర్చిస్తోంది.

కామన్వెల్తు నుంచి భారతదేశం విడిపోవాలని పి. యస్. పి. వాదించుతోంది. కాబట్టి బ్రిటిష్ ఆహ్వానాన్ని పార్టీ తిరస్కరించవచ్చునుకుంటున్నారు.

## మత్తుమందుల దొంగ వ్యాపారం

న్యూయార్క్, జులై 16: మత్తుమందుల దొంగ వ్యాపారాన్ని అరికట్టడంలో లక్షమంది పరిశీలకులు, 18 దేశాలమధ్య చెసిన రేడియో ఏర్పాటు సమితికి తోడ్పడుతున్నాయని సమితి సమాచార పత్రికలోని ఒక వ్యాసంలో పేర్కొన్నారు. ఈ విషయాన్ని అంతర్జాతీయ రహస్యపోలీసుసంస్థ ఉపకార్యదర్శి శ్రీ నెపోతే తెలియజేశారు. 1951 మొదలు ఇలాంటి దొంగవ్యాపారంజేసేవారి 188 పేర్లను ఈసంస్థ బయట పెట్టిందనీ, ఒక్క 1955 లో దొంగ వ్యాపారంపై 46 దేశాలకు 306 నివేదికలు పంపారని కూడా వ్రాసారు. ఈ వ్యాపారంలో ప్రజల సహకారం పోలీసులకు అంతగా ఉండదనీ, అందువల్ల వ్యాపారంచేసే సమయంలోనే పోలీసులు నేరస్థులను పట్టుకోవలసి ఉందనీ అన్నారు. ప్రస్తుతం కొద్దిగంటల వ్యవధిలో సభ్యదేశాల పోలీసులకు ఈ వ్యాపారులగురించి హెచ్చరిక చేసే అవకాశము, మరి కొద్ది దినాలలో అవ్యక్తి వివరాలు తెలిపే వీలూ ఉందన్నారు. జపాన్‌నుండి చివరికి కెనడానుండి న్యూజిలాండ్‌కు సైతం ఈ వివరణ పంపడం కొద్దిరోజుల వ్యవధిలో జరుగుతోందన్నారు. ప్రపంచం అంతటా ఈ సంస్థ నేరపరిశోధకులుగా వ్యవహరించాలని భావించడం తప్పు అన్నారు.

## కాశ్మీరు ముస్లింలపై నిర్బంధాలు

### పాక్ పత్రికల ఆరోపణల ఖండన

న్యూఢిల్లీ, జులై 8: శ్రీనగర్ నుంచి భారత దేశంలోని ఇతర ప్రాంతాలకు రాకపోకలు సాగించే కాశ్మీరు ముస్లింలపై నిర్బంధాలు విధిస్తున్నారన్న కొన్ని పాక్ పత్రికల వ్రాతలు పచ్చి అబద్ధాలని కాశ్మీరు ప్రభుత్వ ప్రతినిధి ఒకరు నేడు చెప్పారు. పర్మిట్ పద్ధతి మినహా ఎట్టి నిర్బంధాలు ఎవరిపైన విధించలేదని, స్వేచ్ఛగా కాశ్మీరుకు రాకపోకలు సాగించవచ్చని అసలు ఒక్క జూన్ నెలలోనే 835 మంది కాశ్మీరు ముస్లింలు విద్యా, వ్యాపార, కార్యకలాపాల సందర్భంలో ఇలా ఇతర ప్రాంతాలకు వెళ్లారని తెలిపారు. 2వేల మంది కాశ్మీరు ముస్లింలు ఇదేకాలంలో దేశంలోని ఇతర ప్రాంతాలనుంచి కాశ్మీరుకు తిరిగి వచ్చారని వివరించారు. ఎవ్వరికీ కాశ్మీరు ప్రవేశానుమతి పత్రాలు నిరాకరించలేదని చెప్పారు.

ఖ్వాజా సదరుద్దీన్ అనే కాశ్మీరీ ముస్లింకు మరి కొందరికి ప్రవేశానుమతి పత్రాలు నిరాకరించారని పాక్ పత్రికలు వ్రాసిన విషయం ప్రస్తావిస్తూ ఈయన ఏప్రిల్‌లోనే కాశ్మీరుకు తిరిగివచ్చి అక్కడే వున్నాడని చెప్పారు.

బాంబు ప్రేలుళ్ల సందర్భంలో వందలాదిని నిర్బంధించారని షేక్ అబ్దుల్లా భార్యకూడా ప్రశ్నలు వేశారని పాక్ పత్రికలు వ్రాసిన విషయాలు ఆధార రహితమని, 10 మందిని మాత్రమే ప్రశ్నించడం జరిగిందని, అందులో కొందరిని అప్పుడే వదలివేశామనీ తెలియజేశారు. ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలుగాని లాఠీచార్జీగాని జరుగలేదన్నారు.

## ఆర్థికాభ్యున్నతికి విద్యావతులైన మహిళలు నిదర్శనం

మధుర, జులై 8: [illegible] న్నతికి జరిగే కృషిలో విద్యావ[illegible] కలు ఎంతమంది పాల్గొన్నా[illegible] బట్టి ఆ దేశం ఎంత అభివృద్ధి[illegible] తెలుస్తుందని విశ్వవిద్యాలయాల ధన సహాయ సంఘం అధ్యక్షుడు శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ అన్నారు.

జెడీవ్‌లాల్ కళాశాల విద్యార్థినుల సభలో శ్రీ దేశ్‌ముఖ్ ఇంకా ఇట్లా చెప్పారు: "పంచవర్ష ప్రణాళికలు ఒక దానివెంట మరొకటి అమలు జరగడంతో భారత దేశంలో ఆర్థికాభ్యున్నతి త్వరితగతిని జరుగుతుంది. బాగా అభివృద్ధి చెందిన దేశాలలో పాల్గొనేటంతి మంది విద్యావంతులైన మహిళలు భారత దేశంలో ఆర్థికాభ్యున్నతికి జరిగే కృషిలో పాల్గొనే రోజు త్వరలో వస్తుందనుకుంటాను. ఎంత ఉక్కు తయారైనదీ? ఎంత విద్యుచ్ఛక్తి తయారైనదనే అంశాలను బట్టి మాత్రమే కాక ఆర్థికాభ్యున్నతికి జరిగే కృషిలో ఎంతమంది మహిళలు పాల్గొన్నారనే అంశాన్ని బట్టి కూడా ఒక దేశం ఎంతగా అభివృద్ధి చెందినదీ నిర్ణయిస్తారు. భారతదేశం, పాకిస్తానవంటి దేశాలలో విద్యావంతులయిన మహిళలు నూటికి పదిమందో పన్నెండుమందో కాగా కొన్ని దేశాలలో నూటికి యాభైమందిదాకా విద్యావంతులయిన మహిళలున్నారు. దీనిని బట్టి భారతదేశం ఈ సందర్భంలో ఇంకా ఎంత కృషిచేయవలసినదీ విశదమవుతోంది."

## సహకారోద్యమంలో సామరస్యం

### అధికారులు అనధికారుల మధ్య

న్యూఢిల్లీ, జూలై 7: సహకారోద్యమంలో అధికారులు, అనధికారుల మధ్య యిప్పుడున్న అంతరం సమసిపోయి, సామరస్యం పెంపొందాలని నూనెలు, గనులశాఖమంత్రి శ్రీ కె. డి. మాళవియా తెలియజేశారు.

ఇక్కడ జరుగుతున్న భారత సహకారయూనియన్ సమావేశంలో ప్రసంగిస్తూ, అధికారులు, యీ ఉద్యమ కార్యకర్తలను కొంత అనుమానంతో చూస్తున్నారనీ, సహకారోద్యమంలో పనిచేసేవారు ఉద్యమ విధానాలను శక్తి సామర్థ్యాలతో అమలు జరుపుతూ, ప్రభుత్వానికి తమపట్లగల అనుమానాన్ని తొలగింపచేసుకోవాలనీ శ్రీ మాళవియా కోరారు. ఇది కష్టమైనప్పటికీ, జరిగి తీరాలన్నారు.

భారత ఆర్థికాభివృద్ధికి సహకారోద్యమము మూలపీఠమని తెలియజేశారు. భారత సహకార యూనియన్‌కు శ్రీ మాళవియా అధ్యక్షులుగా ఎన్నిక అయినారు. గౌరవప్రధాన కార్యదర్శిగా శ్రీ జె. పటేల్ తిరిగి ఎన్నిక అయినారు.

## మలేరియా ఉప్పు

వాషింగ్టన్, జూలై 8: మలేరియా నిర్మూలక ఔషధాలు రెండూ కలిపిన మామూలు ఉప్పు ప్రపంచంలో చలి జ్వరం అనేదానిని లేకుండా నిర్మూలించడానికి ఉపయోగపడే అవకాశం ఉన్నది.

అమెరికా ప్రభుత్వ ఆరోగ్యశాఖ ఈ ఔషధ క్షారాన్ని (మెడికేటెడ్ సాల్టు) తయారు చేశారు. చాల సందర్భాలలో ఇది మంచి విరుగుడని రుజువైంది.

మామూలు ఉప్పులో డారఫిన్, క్లోరోక్విన్ అన్న రెండు మందులూ కలిపి అదే పనిగా వాడితే మలేరియా ముక్కా రాకుండా పోతుంది.

ఇప్పుడు ప్రపంచ ఆరోగ్యసంస్థ ఈ ఉప్పును ప్రపంచంలో మలేరియా ఉండే ప్రాంతాలన్నింటిలోనూ ప్రయోగించి చూస్తారని తెలుస్తున్నది.

అమెరికా ఆరోగ్యశాఖ జరిపిన పరిశీలనలనుబట్టి కొంతమంది ఇదివరకు పూర్వకంగా మలేరియా క్రిములగల దోమలచేత కరిపించుకున్నప్పటికీ వారు ఈఉప్పును వాడుతున్నంతకాలం వారికి మలేరియా జబ్బు రాలేదు. అంతేకాదు ఈ ఉప్పును వాడటం మానివేసిన తరువాత్త కూడా చాలరోజులు దాకా వారికి కవరికీ ఈజబ్బు రాలేదు.

మలేరియా నివారణకు ఈ ఉప్పును జాస్తిగా కూడా తినపనిలేదు. రోజూ తినుబండారాలలో ఎంత ఉప్పు ఉపయోగిస్తారో అంత వాడితే చాలును.

మలేరియా నిలయాలయిన ప్రాంతాలలో నివసించేవారు మామూలు ఉప్పుకు బదులు దీనిని ఉపయోగిస్తే సరి. ఇక ఎన్నిటికీ వారికి మలేరియా రావటానికి వీల్లేదు.

ప్రపంచంలో మలేరియా వ్యాధిని నిర్మూలించటం ప్రస్తుతం తనకు ప్రధానమైన అంశమని ప్రపంచ ఆరోగ్యసంస్థ వార్షిక నివేదికలో వెల్లడించటం జరిగింది.

ఇంతకు పూర్వం ప్రపంచ ఆరోగ్య సంస్థ ఈ మలేరియా నిర్మూలనకై డి. డి. టి. ద్వారా దోమలను చంపించటం వంటి ఉద్యమాన్ని పెద్ద ఎత్తున సాగించింది. అయితే అనేక ప్రాంతాలలో ఈ దోమలు 'డిడిటి'ని కూడా మ్రింగివేసి దానికి చావకుండా ఉండేవిగా తయారవుతున్నవి.

అందుచేత ఇకమీదట మలేరియా నివారణకు వేరే చర్యలు తీసుకోవాలని ప్రపంచ ఆరోగ్యసంస్థ చూస్తున్నది. వాటిలో ఈ కొత్త ఔషధ మిశ్రమమైన ఉప్పు వాడటం ఒకటి.

## బొంబాయి మార్కెట్

బొంబాయి, జూలై 9:

| | |
|---|---|
| వెండి | 179-0-0 |
| బంగారం | 105-5-0 |
| పవరను | 69-14-0 |

## దంటు భాస్కరరావు

కాకినాడ, జులై 6: పురపాలక సంఘ అధ్యక్షుడు శ్రీ దంటు భాస్కరరావును జాతీయ పొదుపు ఉద్యమం రాష్ట్ర సలహా సంఘ సభ్యుడుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించింది. (స్వ. వి.)

# శీతజ్వరంవల్ల ఒంగోలులో మరొక మరణం

## ఈ వారం వ్యాధి తగ్గిందట

ఒంగోలు, జూలై 7: ఒంగోలులోని ఎ. బి. ఎమ్. ఆసుపత్రిలో శీతజ్వరం కారణంగా యీ వారంలో మరొక మరణం సంభవించింది. ప్రభుత్వ ఆసుపత్రి వివరాల ప్రకారం, కిందటివారంలో కంటే ఈ వారం ఇక్కడ శీతజ్వరం తగ్గినట్లు కనిపిస్తోందని గుంటూరు జిల్లా ఆరోగ్యశాఖాధికారి డాక్టరు కె. వీరాస్వామినాయుడు చెప్పారు.

ఒంగోలు సబ్‌కలెక్టరు శ్రీ జె. ఆర్. నాయర్ కోరికపై గుంటూరు జిల్లా ఆరోగ్యశాఖాధికారి ఇక్కడికి వచ్చి స్థానిక ఉన్నత పాఠశాలలనూ, ప్రభుత్వ ఆసుపత్రినీ చూచారు. పాఠశాలలకు సగటున ఎంతమంది విద్యార్థులు హాజరవుతున్నారని ప్రధానోపాధ్యాయులను ఆయన అడిగారు. ప్రభుత్వ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న శీతజ్వర రోగులను ఆయన చూచారు.

ఆ తరువాత పత్రికల విలేఖరులతో ఆయన ఇట్లా అన్నారు: "శీతజ్వరం అంటువ్యాధి ఇక్కడ ఎంతఎక్కువగా వున్నదీ ప్రభుత్వ ఆసుపత్రి వివరాలను బట్టి చెప్పాలి. కిందటివారంతో పోల్చితే యీ వారం ఇక్కడ యీ వ్యాధి కొంచెం తగ్గినట్టే కనిపిస్తోంది. ఇతర వైద్యులను కలుసుకుని మాట్లాడడానికి గానీ, పట్టణంలోని కొన్ని ప్రాంతాలను చూచేందుకుగానీ నాకు వ్యవధి లేదు."

శీతజ్వర నిరోధానికి వినియోగపడే మందును విరివిగా తెప్పించి పట్టణంలోని అన్ని ప్రాంతాలలోనూ, స్థానిక ప్రభుత్వ వైద్యుని సలహా ప్రకారం పంచిపెట్టవలసినదిగా పురపాలక సంఘ ఉద్యోగులకు జిల్లా ఆరోగ్యశాఖాధికారి చెప్పారు. శీతజ్వర నిరోధానికి వినియోగపడే వెయ్యిమాత్రలపెట్టె ఒకటి ఇక్కడికి వచ్చిందట. ఇంకా కొన్ని త్వరలో వస్తవట. (స్వ. వి.)

## పోలమూరులో

పోలమూరులోనూ, నవుడూరు, అండలూరు, కోణితివాడ గ్రామాలలోనూ శీతజ్వరం చాలా ఎక్కువగా ఉన్నది. కోణితివాడ గ్రామంలో దాదాపు 500 మందికి ఈ వ్యాధి వచ్చింది.

## చీరాలలో తగ్గింది

### ఈ వారంలో ముగ్గురి మరణం

చీరాల, జూలై 7: చీరాల ఆసుపత్రిలోని వివరాల ప్రకారం జూన్ ఆఖరికి మొత్తం 5 వేల మందికి శీతజ్వరం తగిలింది. ఈ వ్యాధికి చికిత్స పొందేవారి సంఖ్య ఈనెల మొదటి వారంలో తగ్గింది. జూన్ మొదటి వారంలో మొత్తం 1200 మంది శీతజ్వరరోగులు చికిత్సపొందగా ఈనెల మొదటి వారంలో 250 మంది చికిత్స పొందారు. చీరాలలో శీతజ్వరం తగ్గుతోందని వైద్యశాఖాధికారి చెప్పారు. ఈ వారంలో ఇంతవరకూ ఈ వ్యాధి వల్ల ముగ్గురు మరణించారు.

## వరంగల్లు గుమస్తా సంఘ సమావేశం

### పనికాలం నిర్ణయించే ఏర్పాటుకు హామీ

వరంగల్లు, జులై 8: వరంగల్లుక ర్తక గుమస్తాలకు పని వేళలునిర్ణయించేందుకు త్రైపాక్షిక సంఘాన్ని ఏర్పాటు చేయించ గలననీ, శెలవు దినాలలో కొందరు గుమస్తాలచేతపని చేయిస్తున్న విషయం దృష్టికి తెచ్చినా, ఇన్‌స్పెక్టరు శ్రీ యం. రెడ్డి వహిస్తున్న మౌనాన్ని గురించి వచ్చిన ఆరోపణలను విచారణ చేయిస్తానని జిల్లా లేబర్ ఆఫీసరు శ్రీ అంజయ్య హామీ ఇచ్చారు.

ఈ గుమస్తా సంఘ సర్వసభ్య సమావేశం మొన్న శ్రీ పరిమల సర్వయ్య అధ్యక్షతను జరిగింది. దుకాణాలలోని గుమస్తాలు పనిచేసే కాలానికి ఒక నిర్ణీత పద్ధతి ఏర్పాటు చేయాలనీ వీరు తీర్మానించారు. ఉదయం తొమ్మిది నుండి రాత్రి తొమ్మిదివరకు పనిచేయిస్తున్నారని, ఈమధ్యకాలంలో కనీసం రెండుగంటలపాటు విశ్రాంతి ఈ యజమానులుకూడా వీరు తెలిపారు. ప్రత్యేకాహ్వానంపై శ్రీ అంజయ్య ఈ సభకు వచ్చారు.

సంఘ కార్యదర్శి శ్రీ అర్జుం కొమురయ్య ధన్యవాదాలు తెలిపారు. (స్వ. వి.)

## గ్రామోద్యోగులకు తాత్కాలిక సహాయం

### ఇచ్చేవరకు జమాబందికి గైరు హాజరు

రాయదుర్గం, జులై 8: తాలూకా గ్రామోద్యోగులసంఘం శ్రీ కె. హనుమంతరెడ్డి అధ్యక్షతన సమావేశమై గ్రామోద్యోగులకు తాత్కాలిక సహాయం అందేవరకు జమాబందికి హాజరు కారాదని నిర్ణయించారు.

రాయలసీమసంఘ కార్యదర్శి శ్రీ ఎ. సంజీవరావు ప్రభుత్వ వైఖరిని నిరసించారు. మాట నిలబెట్టుకోవడం లేదని విమర్శించారు. (స్వ. వి.)

## గంటల పంచాంగం

శ్రీ హేమలంబనం॥ ఆషాఢ శు॥ చతుర్థి 1957 సం॥ జూలై 10 బుధవారం శు॥ చతుర్థి రా 8-11 మూల రా8-41 వర్జ్యం 10-45 ల 12-27 వ వర్జ్యం రా 2-0 ల 8-41 వ.

శు॥ పూర్ణిమ జూలై 11 గురువారం శు॥ పూర్ణిమ రా 4-20 పూషా రా 5-31 వర్జ్యం 14-2 ల 15-45 వ.

ఆంధ్రపత్రిక

ఒకళ్లే యని యొదరించిన
వరవర యప్రియము వవ వునంబున గగు దా
వొరులకు నవిపేయకునికి
వరాయణము వరమధర్మ వథముం రెల్లన్
(మహాభారతము)

హేమలంబ నం॥ ఆషాఢ శు॥ చతుర్థి
బుధవారం

## రష్యా పాలకుల సమస్యలు

జూన్ మాసం సోవియట్ పాలకవర్గానికి చాలా చెడ్డ మాసంగా కన్పిస్తున్నది. పదహారు సంవత్సరాల క్రితం హిట్లరు, అంతకు రెండు సంవత్సరాలకు పూర్వం స్టాలిన్‌తో కుదుర్చుకొన్న ఒడంబడికను త్రోసిరాజని రష్యాపై యుద్ధాన్ని ప్రారంభించారు. తిరిగి ఇప్పుడు అదేనెల్లో ఇంతవరకూ అగ్ర నాయకులుగా, పాలకవర్గంలో ప్రముఖులుగా వుంటున్నవారు నలుగురు కృశ్చేవ్ బృందాన్ని కూలద్రోసి, అధికారాన్ని హస్తగతం చేసుకొనడానికి కుట్రపన్నారు. శ్రీ కృశ్చేవ్ పార్టీ కార్యదర్శిగా వున్నంతకాలం వారిపై పన్నే ఏ కుట్రా ఫలించదని మాలొటోవ్, మాలెంకోవ్ ప్రభృతులు గ్రహింపలేదని భావించడానికి వీలులేదు. వీరందరూ స్టాలిన్ అనుయాయులని శ్రీ కృశ్చేవ్‌వర్గంవారు ఆరోపించారు. అయినప్పుడు వీరికి స్టాలిన్ పార్టీ కార్యదర్శి పదవిని ఆక్రమించి, లెనిన్‌ను సహితం ఎలా ధిక్కరింపకలిగారో, తెలియకుండా వుండదు. పార్టీలో అధికారాన్ని సంపాదింపక, ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకొనడం సాధ్యంగాదని స్టాలిన్ మరణానంతరం సంఘటనలు నిరూపించినవి. ఈ విషయాలు దాదాపు పాతిక సంవత్సరాలుగా సోవియట్ వ్యవహారాల్లో ప్రముఖ భూమికను నిర్వహించిన ఈ నాయకులకు తెలియదని భావించడానికి అవకాశంలేదు. ఈ సంగతులన్నీ తెలిసికూడా ఈ నాయక చతుష్టయం కృశ్చేవ్ బృందాన్ని కూలద్రోయడానికి కుట్రపన్నారంటే, రష్యా రాజకీయ పరిస్థితులు ప్రస్తుతం ఎలా వున్నవో కొంతవరకు ఊహించవచ్చును. కృశ్చేవ్ బృందాన్ని అధికారస్థానంనుంచి తొలగించడానికి అవకాశం వున్నదని, అందుకు పరిస్థితులు కొంతవరకు అనుకూలంగా వున్నవని మాలొటోవ్, మాలెంకోవ్ ప్రభృతులు విశ్వసించివుండాలి. పార్టీలో కృశ్చేవ్ వర్గానిదే పైచెయ్యిగా వుంటున్నది. అది మాలొటోవ్ ప్రభృతులకు తెలుసును. కనుకనే వారు కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సంఘ సమావేశానికి విముఖులుగా వున్నారు. ప్రభుత్వ అధిష్ఠాన వర్గంలోమాత్రం శ్రీ కృశ్చేవ్ ప్రాబల్యం కొంతతగ్గినట్లు కన్పిస్తుంది.

పాలకవర్గంలో తగ్గిన పలుకుబడిని, అందువల్ల వారి అధికారానికి ఏర్పడిన ప్రమాదాన్ని నివారించుకొని, తిరిగి ప్రాబల్యం సంపాదించడానికి శ్రీ కృశ్చేవ్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రసంఘాన్ని ఉపయోగించుకున్నారు. మాలొటోవ్, మాలెంకోవ్ ప్రభృతుల 'అంతర్యం' వెల్లడికాగానే శ్రీ కృశ్చేవ్ పార్టీ కేంద్ర సంఘాన్ని సమావేశపరచి మాలొటోవ్, మాలెంకోవ్, కగానోవిచ్, షెపిలోవ్ ప్రభృతులను బర్తరఫ్ చేయించారు. వీరందర్నీ 'స్టాలినిస్టులు' అని అభివర్ణించారు. శ్రీకృశ్చేవ్‌ను ఆయన అనుయాయులను వీరు ట్రాట్‌స్కీ-యిస్టులని ప్రచారం చేశారట. అంటే మూడు దశాబ్దాలక్రితం ప్రారంభమైన స్టాలిన్ - ట్రాట్‌స్కీ తగాదా ఇప్పటికీ రష్యాలో సజీవంగానే వుందన్నమాట. మాలొటోవ్ ప్రభృతులు స్టాలిన్‌వలెనే కమ్యూనిజంను ఒక్క దేశంలో స్థాపించి, రక్షింపవచ్చునని భావిస్తుంటే కృశ్చేవ్ ప్రభృతులు అది సాధ్యంగాదని ప్రపంచవిప్లవం కొరకు ప్రయత్నిస్తున్నారని ఈ సంఘటనల వల్ల ఒకవిధంగా విదితమవుతున్నది.

వీటన్నింటివల్లా ఇటీవల రష్యాలో వచ్చిన మార్పులు కమ్యూనిస్టు, కమ్యూనిస్టేతర రాజ్యాలమధ్య సామరస్యాన్ని పెంపొందించడానికి తోడ్పడగలవనే విశ్వాసానికి తగినంత ఆధారంలేదని స్పష్టమవుతున్నది. శ్రీ కృశ్చేవ్, శ్రీ బుల్గానిన్‌లు ప్రస్తుతం చెకోస్లవేకియాలో పర్యటిస్తున్నారు. తూర్పు యూరప్ రాజ్యాల విషయంలో ఇకనుంచీ రష్యా అనుసరింపనున్న విధానాన్ని యీ నాయకులు ప్రాగ్ సమాలోచనల అనంతరం వెల్లడించగలరని తెలుస్తున్నది. ఇంతవరకూ శ్రీ కృశ్చేవ్ ప్రభృతులు వారు సరియైనదనుకున్న విధానాన్ని అనుసరింపగల స్థితిలో లేరని, అగ్రనాయక చతుష్టయాన్ని బర్తరఫ్ చేయడంతో వారు క్రొత్తవిధానాన్ని అనుసరింప కలుగుచున్నారనే వాదం నిస్సారంగాకన్పిస్తున్నది. కేంద్ర సంఘంలో శ్రీ కృశ్చేవ్ అధికారానికి తిరుగులేదని స్పష్టమైనది. కేంద్ర సంఘం నిర్ణయించే విధానాలను పాలకవర్గం అమలు చేసితీరవలసిందే. పద్ధతులు, పరిస్థితులు ఇలా వున్నప్పుడు మాలొటోవ్ ప్రభృతుల 'బర్తరఫ్ నాటకం' లక్ష్యం, అవసరం ఇంతవరకూ వెల్లడి కాలేదనే భావింపవలసి వుంటుంది.

## 2 ఏళ్లలో పాక్‌కు అమెరికా సహాయం

### 18 కోట్ల డాలర్లు: 1958 లో మరింత!

వాషింగ్టన్, జూలై 9: 1956-1957 లలో అమెరికా పాకిస్తాన్‌కు 18 కోట్ల డాలర్ల దాకా రక్షణ సహాయం చేసింది. 1958 లో గూడా చేస్తుంది. కాని ఈ మొత్తం ఎంతో ఇంకా తేలలేదు. పాకిస్తాన్ రక్షణవ్యయాన్ని పురస్కరించుకొని, ఆదేశం ఆర్థిక వ్యవస్థ దెబ్బ తినిపోకుండా వుండేటంతగా ఈ సహాయం వుంటుందని అధికారులు చెబుతున్నారు.

రేపు పాకిస్తాన్ ప్రధానమంత్రి శ్రీ సురావర్దీ ఇక్కడికి వస్తారు. 10 రోజుల పాటు అమెరికాలో పర్యటిస్తారు. ఇందులో మూడురోజులు అమెరికా రాజధానిలో గడుపుతారు. ఈ మూడు రోజుల్లోను అమెరికా అధ్యక్షుడితోను, విదేశాంగ మంత్రితోను మాట్లాడతారు. అమెరికా కాంగ్రెస్ రెండు సభల సమిష్టి సమావేశంలోను ఉపన్యసిస్తారు. నేషనల్ ప్రెస్ క్లబ్బులో మాట్లాడతారు. అమెరికా విదేశాంగశాఖ ప్రధానోద్యోగులతో మంతనాలు జరుపుతారు.

అమెరికా అధికారులతో శ్రీ సురావర్దీ బహువిషయాలను గూర్చి చర్చింపవచ్చుగాని, అసలు చర్చించే విషయం, అమెరికా సహాయాన్ని గురించిందే. ఈ సమాలోచనలలో పాక్ ఆర్థిక మంత్రి శ్రీ అంజాద్ అలీ ఈయనకు తోడుగా వుంటారు. శ్రీ అలీ అప్పుడే రెండు వారాలుగా, అమెరికాలో, ఈ మంతనాలు సాగిస్తున్నారు.

రష్యాలో మార్పులను గురించి, వాటిని గూర్చి కామన్‌వెల్తు ప్రధానులు ఏమనుకొన్నది, మధ్య ప్రాచ్య వ్యవహారాలు, ఇంకోసాధ్యమైతే, కాశ్మీర్ పంజాబు నీటి కాల్వల సమస్య గూడా ఈ సందర్భంలో ఈ చర్చలకు గురికావచ్చునంటున్నారు.

అమెరికానుంచి ఆహార ధాన్యాలను సంపాయించాలని గూడా పాకిస్తాన్ చూస్తోంది. శ్రీ అంజాద్ అలీ ఈ విషయమయ్యే ఇప్పుడు ముఖ్యంగా మంతనాలు సాగిస్తున్నారు. ఇది ఇంకా తేలదు.

## "ఇప్పటి ఆర్థిక చిక్కులు తాత్కాలిక మైనవే"

### సి. డి. దేశముఖ్ ఆశాభావం

మధుర, జూలై 8: "డబ్బువిషయమై ప్రస్తుతం కనిపిస్తున్న వాదోపవాదాలూ, చిక్కులూ త్వరలో పరిష్కారమై, విశ్వవిద్యాలయాల ధనసహాయ సంఘం నిర్వర్తించవలసిన విధులను సక్రమంగా నిర్వర్తించడానికి వీలుగా మొదట దానికి కేటాయించిన డబ్బును దానికి అందచేస్తారని ఆశిస్తున్నాను." అని మధుర కాలేజీలో పోస్టు గ్రాడ్యుయేట్ సైన్సు తరగతుల భవనానికి శంకుస్థాపన చేస్తూ విశ్వవిద్యాలయాల ధనసహాయ సంఘం అధ్యక్షుడు శ్రీ సి. డి. దేశముఖ్ అన్నారు.

శ్రీ దేశ్‌ముఖ్ ఇంకా ఇట్లా చెప్పారు: "దేశంలో వివిధ రంగాలలోనూ ప్రమాణాలను పెంపొందించాలనే సాధారణ సమస్యకుతోడు, త్వరితగతిన అభివృద్ధిచెందుతున్న ఆర్థిక వ్యవస్థకు అనుగుణంగా వివిధ అభివృద్ధి పథకాలనూ అమలుజరపడానికి అవసరమైన శాస్త్రవేత్తలనూ, సాంకేతిక నిపుణులనూ తయారుచేయడం ముఖ్యమని అనుకొంటాను. నిపుణులు లేకపోతే ప్రణాళికలో ఏపనీ జరగదు. కనుక ప్రస్తుత ఆర్థిక చిక్కులు ఎట్లా ఉన్నా కూడా సాంకేతిక నిపుణులను తయారుచేసే సౌకర్యాలను విస్తృతం చెయ్యడానికి మాత్రం డబ్బు ఇస్తారని అనుకొంటున్నాను."

"ఒకదేశంలోని వస్తుసంపదనూ, అవకాశాలనూ విజ్ఞతతో పరిశీలించి, ప్రజలకు మేలుకలిగేటట్టు వాటిని వినియోగంలోకి తీసుకురావడానికి శాస్త్ర విజ్ఞానం ఉపయోగపడుతుంది. కనుక ప్రస్తుత ప్రపంచ వ్యవహారాలలో శాస్త్రవిజ్ఞానం ప్రాముఖ్యాన్ని వివేకవంతులందరూ గ్రహించారనుకుంటాను. ప్రజల ఆర్థిక స్థితిగతులను బాగుచెయ్యడానికని ఒకప్పుడు వెనుకపడి ఉన్న చైనావంటి దేశాలుకూడా శాస్త్రవేత్తలనూ, సాంకేతిక నిపుణులనూ తయారు చేస్తున్నది. కనుక ఒకపద్ధతిలో శాస్త్ర విజ్ఞానాభివృద్ధి అవకాశాలనూ, సాంకేతిక విజ్ఞానాభివృద్ధి అవకాశాలనూ పెంపొందించేందుకు భారతదేశంలో జరిగే ప్రయత్నాలన్నింటినీ ప్రోత్సహించడం అత్యవసరమని స్పష్టమవుతుంది. ప్రస్తుతం లభిస్తున్న అవకాశాలను సక్రమంగా వినియోగించుకుని, కొంచెం త్యాగబుద్ధితో పనిచేస్తే సాంకేతికంగానూ, శాస్త్ర విజ్ఞాన రంగంలోనూ మన ప్రస్తుత పరిస్థితిని కొద్దికాలంలో తప్పకుండా అభివృద్ధి చేసుకోగలము."

"శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక రంగాలలో మనం ఇంకా చాలా అభివృద్ధి చెందవలసి ఉన్నది. ఒక దేశంలో జరుగుతున్న అభివృద్ధిని కృషిని ఇరుగు పొరుగు దేశాలలో జరుగుతున్న కృషితో పోల్చిచూచుకోడం సహజం. కనుక చైనాలో ఏమి జరుగుతున్నదీ మనం జాగ్రత్తగా చూచి మంచిని నేర్చుకోడం అవసరం."

"సాంకేతిక విద్య అవసరమనే విషయమై ద్వివిధాభిప్రాయాలు లేవు. కాని, శాస్త్రవిజ్ఞానం ప్రాముఖ్యాన్ని గమనించారో లేదోనని నా సందేహం. సాంకేతిక విజ్ఞానం ఎంత అభివృద్ధి చెందినా, సాంకేతిక నిపుణుల కృషిని, శాస్త్రవిజ్ఞానం తెలిసినవారు నిరంతర కృషితో, సాంకేతిక నిపుణులు సాధించిన ఫలితాలను సమర్థించడం అవసరం. ఉపాధ్యాయులనేకాక ఇటువంటి విజ్ఞానులను కూడా విశ్వవిద్యాలయాలు తయారుచెయ్యాలి. ఆర్థిక రంగంలో ఎన్నిరోతిలువచ్చినా, కనీసం శాస్త్రవిజ్ఞానాభివృద్ధి కృషికి అయినా తగినంతడబ్బు కేటాయిస్తారని ఆశిస్తున్నాను. విద్యార్థులకు ఇతోధిక సౌకర్యాలు ఏర్పాటు చెయ్యడానికీ, ఉపాధ్యాయుల ఉద్యోగ సౌకర్యాలను - ముఖ్యంగా విశ్వవిద్యాలయాలకు అనబంధమైన కళాశాలల్లోని ఉపాధ్యాయులస్థితిగతులను బాగుచెయ్యడానికి వినియోగపడే మార్గాలనైనా అన్వేషిస్తారని ఆశిస్తున్నాను. పంచవర్ష ప్రణాళికలను అమలు జరిపే ఒత్తిడిలో పాఠశాలలకు సమర్థులయిన ఉపాధ్యాయులు దొరకకుండా చెయ్యరాదు. పాఠశాలలకు సరయిన ఉపాధ్యాయులు దొరకక పోవడం అనేది చాలా విచారపడవలసిన పరిస్థితి అవుతున్నది. అటువంటి శోచనీయ పరిస్థితి ఏర్పడకముందే జాగ్రత్తపడటం సమంజసం".

## ఆంధ్ర విశ్వవిద్యాలయం

### బి. ఎస్‌సి. (ఆనర్స్) పరీక్షా ఫలితాలు

వాల్తేరు, జూలై 8: ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆధ్వర్యాన ఈ సంవత్సరం (1957) ఏప్రిల్ మాసంలో జరిగిన బి. ఎస్‌సి. (ఆనర్స్) పరీక్షలలో దిగువ నెంబర్ల విద్యార్థులు కృతార్థులయ్యారని రిజిస్ట్రార్ ప్రకటించారు.

#### ద్వితీయ విభాగం

కెమికల్ టెక్నాలజీ

(మెయిన్)

ప్రథమశ్రేణి: 674, 675, 676, 679, 681, 682, 683, 684, 686.

ద్వితీయశ్రేణి: 677, 678, 680, 685.

తృతీయశ్రేణి: ఎవ్వరూలేరు.

### కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, జూలై 8: కృష్ణా నదిలో ఈరోజున నీరు ఆనకట్టపై 7 అడుగుల 8 అంగుళాల ఎత్తున ప్రవహిస్తోంది.

## ఆగస్టులో సమ్మెకు తంతి తపాల సిబ్బంది సిఫార్సు

### సమ్మెచేయరని అధికారుల ఆశాభావం: తుదినిర్ణయానికి ప్రతినిధుల సమావేశం

న్యూఢిల్లీ, జూలై 8: ఆగస్టులో సమ్మె ప్రారంభం కానున్నట్లు ప్రభుత్వానికి తెలియబరచాలని ప్రతినిధి మండలికి (జనరల్ కౌన్సిల్) సిఫార్సుచేస్తూ తంతి తపాల సిబ్బంది జాతీయ సమాఖ్యకు అనుబంధంగా వున్న 7 సంఘాలు నేడు తీర్మానించాయి. ఇక రెండు సంఘాలు తమ నిర్ణయం తెలియజేయవలసి వున్నది.

ఇవి తపాలాశాఖ మూడవతరగతి సిబ్బంది, తంతిశాఖ మూడవతరగతి ట్రాఫిక్ సిబ్బంది, సంఘాలు. ఈరెండు సమ్మె ప్రతిపాదనను గురించి రాత్రి చాలా ప్రొద్దుబోయే వరకు చర్చిస్తూనే వున్నాయి. బహుశః వీరుకూడా అదే నిర్ణయం చేయవచ్చు.

ఈతొమ్మిది సంఘాలు చేసిన సిఫార్సులపై తుది నిర్ణయాన్ని ప్రతినిధి మండలి చేయవలసి వున్నది. వీరి సమావేశం రేపు ప్రారంభ మవుతుంది.

ఇప్పుడు సమ్మె నిర్ణయం చేసిన 7 సంఘాలు ఏకగ్రవంగానే యీ నిర్ణయం తీసుకున్నాయని సమాఖ్య కార్యదర్శి శ్రీ బి. యన్. ఘోష్ చెప్పారు.

రెండవ వేతన నిర్ణాయక సంఘం నియమించడం, తాత్కాలికంగా కరువుబత్తెం, జీతాలస్కేల్లు పెంచడం, కరువుబత్తెమును ప్రాతి పదిక జీతంలో కలపడం, సమాఖ్య ముఖ్యమైన కోరికలు.

### సమ్మె చేయరని అధికారుల ఆశాభావం

పరిస్థితి ఇంతవరకు వచ్చినప్పటికీ, సంప్రతింపుల ద్వారా కోర్కెలు సాధించుకునే పద్ధతిని ప్రతినిధి మండలి విరమించదని అధికార వర్గాలవారు తమ ఆశాభావం వెలిబుచ్చుతున్నారు. ఇదివరలో యీశాఖకు మంత్రిగా వుండిన శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి మాదేశ్య క్రితం ఒకసారి సమాఖ్య సమావేశంలో ప్రసంగిస్తూ సానుభూతితోను, మానవత్వ దృష్టితోను సిబ్బంది కోర్కెలు ఆలోచించ గలమని చెప్పివున్నారని కూడా యీ సందర్భంలో వీరు అంటున్నారు. పైగా సిబ్బంది కోర్కెలలో మూడుమినహా తక్కిన కోర్కెలన్నీ చాలావరకు తీర్చడమో లేక ఆలోచనలో వుంచడమో జరిగిందని తెలిసింది. ఈమూడు, రెండవ వేతన నిర్ణాయకసంఘనియామకం, కరువుబత్తెం పెంపుదల, దానిని ప్రాతిపదిక జీతంలో కలపడం, ఇవి అన్ని ప్రభుత్వశాఖల సిబ్బందికి చెందిన కోర్కెలేగాని వీరికొక్కరికే యీ సమస్యలేదని అధికారులవాదన ఇదే అమోదిస్తే అసలు దేశంలో వేతన వ్యవస్థనే పరిగణనలోకి తీసుకోవలసి వున్నది. ఇప్పుడు సమ్మె చేస్తే దేశాభివృద్ధి పనులకు ఆటంకం కలుగుతుందని వీరు చెబుతున్నారు.

## వరదలనుంచి రైలుమార్గం వంతెనల రక్షణ

### ప్రతిరాష్ట్రంలోను ఒక ఇంజనీర్ల సంఘం ఏర్పాటు

న్యూఢిల్లీ, జూలై 8: వరదల సమయంలోను, జడివర్షాలు కురుస్తున్నప్పుడు రైలుమార్గం, వంతెనలు దెబ్బతినకుండా, తగు రక్షణ చర్యలు తీసుకుంటూ, నిర్విరామంగా పరిస్థితులను పరిశీలిస్తూ ఉండేందుకు ప్రతి రాష్ట్రంలోను ఇంజనీర్లస్థాయి సంఘాలు ఏర్పాటుచేయాలని రైల్వేమండలి అన్ని రాష్ట్రప్రభుత్వాలకు ప్రతిపాదించింది.

ప్రతి రాష్ట్రంలోను పనిచేస్తున్న రైల్వే, మండలాల ప్రతినిధులతోబాటు ఆయా రాష్ట్ర పబ్లిక్ వర్క్సు, నీటి పారుదల, అడవులు, స్థానిక స్వపరిపాలన శాఖల ప్రతినిధులు గూడా యీ సంఘంలో సభ్యులుగా ఉంటారు.

గత జూన్ లో రాష్ట్ర ముఖ్య మంత్రులకు, రైల్వే మంత్రికి మధ్య యిక్కడ సమావేశం జరిగినప్పుడు, రైలుమార్గానికి తగు రక్షణ కల్పించటంలో రైల్వేశాఖ, రాష్ట్రాల మధ్యపూర్తి సహకారాన్ని సాధించే అంశంపై చర్చలు జరిగాయి.

ఈరాష్ట్రీయ సంఘం తరచుగా సమావేశం అవుతూ వివిధ శాఖలు రూపొందించిన పథకాలను చర్చిస్తుంది. ఒకశాఖ తయారుచేసిన పథకం మరోశాఖపై కార్యకలాపాలపై దెబ్బతీసేదిగాగానీ లేక ఆస్తుల రక్షణకు ముప్పు కలిగించేదిగాగానీ ఉన్నప్పుడు, ఎలాంటిరక్షణ చర్యలు అమలుజరుపవలసిందీ గూడా వీరు ఆలోచిస్తారు.

విపరీతంగా వర్షాలు కురుస్తున్న తరుణంలోను, వరదలు ముంచుకొని వస్తున్నప్పుడు, తుపాను రావచ్చునని తెలిసినప్పుడు, సమాచారాన్ని సేకరించి, యితర శాఖల అధికారులకు తగువిధంగా హెచ్చరికలు, సూచనలు ప్రసారం చేసేందుకు గాను యీ సంఘాలు ఒక విధానాన్ని తయారుచేస్తాయి.

ఏదైనా అసాధారణ సంఘటనలు సంభవించినప్పుడు, దానికి సంబంధించిన శాఖకు, యీ సమాచారాన్ని తక్షణం అందజేయటంలో ప్రజలు సహకరించేటట్లుగూడా యీ ఇంజనీర్ల సంఘాలు కృషిచేస్తాయి. ఒక ప్రాంతంలో జలమార్గాల రక్షణకు ఏదైనా ఒక శాఖ ఏర్పాటుచేసిన నిర్మాణాలు వరదలతో దెబ్బతినటంవల్ల, ఆప్రాంతానికి తగు రక్షణ ఉండేదీ లేనిదీ గూడా ఈ సంఘాలు పరిశీలించి చర్యలు తీసుకుంటాయి.

## పంజాబ్ కాలువల నీటి తగాదా

### ప్రపంచ న్యాయస్థానానికి భారత్ నివేదించదు

న్యూఢిల్లీ, జూలై 8: భారత పాకిస్తాన్ దేశాల మధ్య నలుగుతున్న పంజాబ్ కాలువల నీటి వివాదాన్ని అంతర్జాతీయ న్యాయస్థానానికి నివేదించాలని భారతదేశంలో యిదివరలో ఎన్నడూ ఉద్దేశించి ఉండలేదు. ఇప్పుడు గూడా అలాంటి ఆలోచన ఏదీ లేదు" అని యీ అంశాన్ని ప్రపంచ న్యాయస్థానానికి తీసుకొనిపోదలచామంటూ పాకిస్తాన్ ప్రధాని శ్రీ సురావర్దీ నిన్న లండన్‌లో చేసిన ప్రకటనపై యిక్కడి అధికారులు తెలియజేశారు.

### ప్రపంచ న్యాయస్థానం చేసే దేమీలేదు-పాటిల్

కాలువల నీటి వివాదాన్ని ప్రపంచ బ్యాంకు యిదివరకటినుంచీ, పరిశీలిస్తు పరిష్కారంకోసం కృషి చేస్తున్న కారణంగా, యిప్పుడు అంతర్జాతీయ న్యాయస్థానం, యీ విషయంలో చేసే దేమీలేదు.'' అని కేంద్ర నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి శ్రీ యస్. కె. పాటిల్ చెప్పారు.

'న్యాయం, ధర్మం, మనవైపే ఉన్నాయి. ఈ వివాదం ఎక్కడికి వెళ్లినా భారతదేశానికి విజయంతప్పదు' అని పత్రికా విలేఖరుల సమావేశంలో శ్రీ సురావర్దీ ప్రకటనను వ్యాఖ్యానిస్తూ శ్రీ పాటిల్ తెలియజేశారు.

మధ్యవర్తి పరిష్కారానికి-ఎలాంటిదైనప్పటికీ - భారతదేశం ఆమోదిస్తుందన్న యిటీవలి తమ కలకత్తా ప్రసంగంపై మాట్లాడుతూ, యిది చాలా ముఖ్యమైన విషయమనీ, తుణ్ణంగా చర్చించటానికి కొంత అవకాశం అవసరమనీ కలకత్తాలో పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ కేంద్రమంత్రి అన్నారు.

## స్పెయిన్‌తో పాకిస్తాన్ శాంతిసంధి

మాడ్రిడ్, జూలై 8: పాకిస్తాన్, స్పెయిన్ నేడు శాంతి సంధిని కుదుర్చుకున్నాయి.

## విదేశాలతో వ్యాపారం అభివృద్ధికి సంఘం

### 5 గురు సభ్యులతో ఏర్పాటు

న్యూఢిల్లీ, జులై 8: ఎగుమతులను అభివృద్ధిచేసి, ఎక్కువగా విదేశీ ద్రవ్యార్జనకు కృషిచేసేందుకు వాణిజ్య పరిశ్రమల శాఖలో భారతప్రభుత్వం ఇవాళ ఒక సంఘాన్ని నెలకొల్పింది. ఇందులో ఐదుగురు సభ్యులుంటారు.

వాణిజ్య పరిశ్రమలశాఖమంత్రి శ్రీ మొరార్జీదేశాయ్, క్రితంనెల ఎగుమతుల అభివృద్ధి సలహామండలి సమావేశంలో ప్రసంగిస్తూ, ఎగుమతుల అభివృద్ధికి ఇటువంటి సంఘాన్ని యేర్పాటుచెయ్యాలని ప్రభుత్వం నిర్ణయించినట్లు చెప్పారు.

భారత విదేశ వ్యాపారాభివృద్ధికి ముఖ్యంగా ఎగుమతులకు సంబంధించిన కృషినంతా, యీసంఘం సమన్వయ పరుస్తుంది. విదేశీవ్యాపారంలో ఎప్పటికప్పుడు ఎదుర్కొవలసివచ్చే సమస్యలను ఇబ్బందులను సమీక్షించి,ద్వితీయ పంచవర్ష ప్రణాళికావసరాలకు తగ్గట్టుగా వాణిజ్య విధానాలను రూపొందించడంలో తోడ్పడుతుంది.

ప్రభుత్వం ఇప్పుడు యేర్పాటుచేసిన యీసంఘానికి, వాణిజ్య, పరిశ్రమల శాఖ సంయుక్తకార్యదర్శి శ్రీ కె. బి. లాల్ అధ్యక్షులుగా ఉంటారు. విదేశీ వ్యాపారంలోఉన్న వివిధసంస్థల పనికి సమన్వయం కుదిర్చేందుకుగాను, ఈయనను విదేశీవ్యాపార డైరెక్టర్ జనరల్ అని హోదాకూడా ఇచ్చారు.

ఈసంఘంలో మిగతా సభ్యులు:- వాణిజ్య పరిశ్రమలశాఖకు చెందిన మరో సంయుక్తకార్యదర్శి శ్రీ ఎ. జమాన్, దిగుమతి, ఎగుమతుల ఖాయిదాలకు సంబంధించిన ప్రధానాధికారి శ్రీ ఎస్. ఎన్. బిల్‌గ్రామి, ప్రభుత్వ వాణిజ్య సంస్థ మేనేజింగ్ డైరెక్టరు, ఎగుమతుల అభివృద్ధిసంస్థ డైరెక్టరు. ఈఉద్యోగం యిప్పుడు కొత్తగా సృష్టించారు. అనుభవజ్ఞుడైన ఒక ఉద్యోగిని, ఈఉద్యోగంలో నియమిస్తారు. ఎగుమతుల అభివృద్ధికి నిర్దుష్టమైన చర్యలు అవలంబించడం; వ్యాపారస్తులతో పరిచయం కలిగిఉండడం; ఎగుమతుల అభివృద్ధి విషయంలో, పరిపాలనా సంబంధమైన తదితరమైన ఆలస్యాలుంటే వాటిని తొలగించడానికి కృషిచేయడం ఈయనపని.

ఈసంఘం కనీసం 15 రోజులకొకమారు సమావేశమౌతుంది. తొలి సమావేశం జులై 11న జరుగవచ్చునని తెలిసింది.

## జాతీయ ప్రావిడెంటుఫండ్ సంస్థ ఏర్పాటు సంకల్పం

### కేంద్ర ఆర్థిక మంత్రి వెల్లడి

మదరాసు, జులై 9: పన్ను మదింపు వ్యత్యాసాలపైనా కార్మిక తగాదాలపైనా వేసే రిట్ దరఖాస్తుల సత్వర పరిష్కారానికి ఫ్రాన్సులోవలె పరిపాలనా సమస్యల పరిష్కార సంఘాలను (అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్స్) నియమించాలని కేంద్రప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి నిన్నరాత్రి ఇక్కడ వెల్లడించారు. ఇదేగాక కేంద్రప్రభుత్వ జాతీయ ప్రావిడెంటుఫండ్ నిధిని ఏర్పాటుచేసి దానిని ప్రధానంగా గృహనిర్మాణ పథకాలకు వినియోగించాలని ఆలోచిస్తున్నట్లు ఆయన తెలియజేశారు.

శ్రీ కృష్ణమాచారి నిన్న సాయంత్రం పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రధాన వస్తువుల ధరలు గూర్చి ప్రస్తావిస్తూ బియ్యం తినే ప్రాంతాలవారు తిండి అలవాట్లను మార్చుకునేవరకూ బియ్యం ఉత్పత్తి నామక మిగులుగా వున్నంతవరకు ఏదోరకంగా కంట్రోళ్లు వుండక తప్పదని అన్నారు. అయితే ఇది తమ స్వంత అభిప్రాయమని మధ్య తరగతివారు కంట్రోళ్లను సుముఖంగా లేరని చెప్పారు.

ఆర్థికమంత్రి ప్రభుత్వ ఆర్థిక విధానం గూర్చి ఇట్లా చెప్పారు: "సాధ్యమైనంతవరకూ బడ్జెటు లోట్లను భర్తీ చేసుకోవాలని ప్రధానమంత్రి రాష్ట్రాలకు సలహా ఇచ్చారు. కేంద్రపన్నుల విధానానికి అసమ్మతి సూచకంగా రాష్ట్రాలు లోటుబడ్జెటులు తయారు చేస్తున్నాయంటే నేను అంగీకరించను. రాష్ట్రాలకు న్యాయంగా రావలసిన సొమ్మును నేను అడ్డం తగలటం లేదు. సుంకాలు, రైల్వేప్రయాణీకుల చార్జీలను పెంచి రాష్ట్రాలకు 15 కోట్లు సంపాదించి పెట్టాము. కేంద్రపన్నుల విధానానికి రాష్ట్రాల సంపాదన మార్గాలకు సంబంధంలేదు. పన్నులు వేసుకోవటం లేదా మానుకోవటం నా ఇష్టం. నాకు సంబంధించినంతవరకూ ప్రణాళిక అమలుకు కావలసిన ధనం చేకూర్చి నోట్ల చలామణీని,తగ్గించవలసిన బాధ్యత నాపైన వుంది. కొద్దిపాటి లోటువున్న రాష్ట్రాలు ఆ లోటును భర్తీ చేసుకోవచ్చును. రాష్ట్రాలు అవసరమైతే ప్రజలనుండి అప్పు తీసుకోవచ్చు. కానీ నిరుడు మాదిరి జరగకూడదు. అప్పుచేయడం మంచిదికాదని అన్నానుగాని, అప్పు చేయటానికి వీలులేదని చెప్పలేదు."

"పొదుపు ఉద్యమంద్వారా రు 80 కోట్ల ఆదాయం అంచనా వేశాం. ఆ మొత్తాన్ని రాష్ట్రాలకు వదులుతే అంత మొత్తాన్ని కేంద్రం చూసుకోవటం సులభమైన పనికాదు."

"కేంద్ర విక్రయంపన్ను విషయంలో ప్రధానమైన వస్తువులపై పన్నును నూటికి 2 వంతులకు పరిమితం చేశాం. అటువంటివి చాలా తక్కువ వస్తువులు వున్నాయి. పన్నుల విచారణ సంఘం ముందు పెద్ద జాబితా వుంది. వారు దానిని తగ్గించమన్నారు. తగ్గించాం. కేంద్ర విక్రయం పన్నువలన కేంద్రానికి ఒరిగేది ఏమీలేదు." అని అన్నారు.

భూమిశిస్తును రద్దు చేయాలని తాము చేసిన సూచనను వ్యాఖ్యానం చేస్తూ "ఈ సూచనను నేను చాలాకాలంగా చేస్తున్నాను. దానికి ప్రత్యేకమైన ప్రాధాన్యం ఏమీలేదు. అసాధ్యమైతే యథేచ్ఛగా నిరాకరించవచ్చును. నా సలహా వింటే ఆదాయం పెరుగుతుంది" అని చెప్పారు.

విదేశీ ద్రవ్యస్థితి గూర్చి ఇల్లా అన్నారు: "విదేశీ ద్రవ్య పరిస్థితి నానాటికి తీసికట్టుగా వుంది. నిల్వవుండవలసిన దానికంటె తగ్గి రు 357 కోట్లు అయింది. రేటు పెరిగిపోయింది. మే, జూన్ నెలలో పరిస్థితి మరీ అధ్వాన్నమైంది. దిగుమతి అనుమతి పత్రాలు వున్నవారు వాడుకుంటున్నారు. కరెన్సీ మద్దతుతో రు 400 కోట్లు మామూలుగా వుండాలి. ఇక ముందు సంపాదనమీద ఆధారపడవలసి వుంది. ప్రస్తుతం వాడకానికి తగినంత సంపాదనలేదు. నిరుడు దిగుమతులు వెయ్యికోట్లు, ఎగుమతులు రు 650 కోట్లు వుండి తేడా రు 350కోట్లువుంది. దిగుమతులను పరిమితం చేసుకొని తేడాను తగ్గించుకోవలసివుంది. ఈ చిక్కు ప్రణాళికవలన వచ్చింది. ఇది అనుకున్నదేగాని ఇంతలోనే వస్తుందని అనుకోలేదు."

"దిగుమతులను నిలిపివేయటం వల్ల ద్రవ్యోల్బణం ఎంతవరకు వుంటుందో చెప్పలేం. కాని ప్రస్తుతం ఆహారధరలలో ద్రవ్యోల్బణ స్థితి కనిపిస్తోంది. బండి నడిచేందుకు అవసరమైనంత వరకు దిగుమతి చేయదలచాం. బియ్యాన్ని ఎక్కువగా దిగుమతి చేయటంసాధ్యం కాకపోవచ్చును. నాణాల చలామణీ మార్పులవలననే ద్రవ్యోల్బణం ఏర్పడింది. పంచదారకు సంబంధించినంతవరకూ సుంకంచేర్చి బస్తాకు రు 14 పెరిగింది. ఉత్తరాదిన ఇంకా జాస్తివుంది. రవాణా ఎక్కువగావుంది. కొంతకుంచి మాటుపరచి నిల్వచేయాలని ప్రయత్నిస్తున్నారుకూడా."

"ఎక్సైజు సుంకాలవల్ల ద్రవ్యోల్బణం వచ్చిందనేది సరికాదు. అధికలాభాలను అదుపులో వుంచేందుకు ఈ సుంకాలను విధిస్తారు. ఈ సుంకాలవల్ల ధరలు పెరిగి కార్మిక తరగతి, మధ్యతరగతి జనం ఉపవసమాల్యం పెరిగితే పెరిగిఉండవచ్చును. అది మంచిదికాదు. పంచదారపైన కొంతకంట్రోలు పెట్టటానికి ఆలోచిస్తున్నారు.

### కంట్రోళ్ల ఆవశ్యకత

ధరలను అదుపు చేయాలని కోరితే ప్రభుత్వంనుంచి మంచిసమాధానం రావచ్చు. ధరలను అదుపుచేయకుండా కరవుభత్యం కోరటంలో అర్థంలేదు. కాని మధ్యతరగతి జనానికి కంట్రోళ్లంటే ఇష్టంలేదు. ఏదో దశలో కంట్రోళ్లు తప్పవు. అది ప్రాంతీయ రవాణాకు సంబంధించి వుండవచ్చును లేదా సేకరణ గుత్తకు సంబంధించి వుండవచ్చును. సేకరణకు కొంతమంది వ్యాపారులకు అనుమతి ఇవ్వవచ్చును. ఏమైనా సామాన్యజనం అడిగందే ప్రభుత్వం కలుగచేసుకోదు."

గత అనుభవంబట్టి కంట్రోళ్ళు వద్దంటున్నారనగా "భూతం వుందని భయపడితే ఎప్పుడూ ఇంట్లోంచి బయటకు రాలేం" అని కృష్ణమాచారి అన్నారు. బియ్యం తినేవారు తిండి అలవాట్లను మార్చుకోకపోతే బియ్యం చాలవు. అందువలన ఏదో రకమైన కంట్రోలు వుంచక తప్పదు అని అన్నారు.

### పని మానటం పొదుపుకాదు

"భవన నిర్మాణ కార్యక్రమం ఆపు చేయటం పొదుపుకాదు. పని పోట్లు చూపించేందుకు ప్రభుత్వం నిర్మాణాలు కొనసాగించవలసివుంటుంది. అయితే ఉక్కు సిమెంటు కొరతవుంది. సిమెంటు 1959 లో పుష్కలంగా లభించవచ్చును. ఆ దృష్టితో మనం పథకాలను వేసుకోవలసివుంది."

"ఇక నగరాల వర్గీకరణం వుంది. అసలు ఈ విభజన వుండకూడదు. అయితే ఎలా మార్చటమా అనేదివుంది. ఈ వర్గీకరణ పూర్తిగా తీసివేయాలి. ప్రభుత్వ ఉద్యోగులు అడిగింది చేశాం. ఫలితం ఏమిటో చూడాలి. కొంత భారాన్ని ఎప్పుడో అప్పుడు వారు కూడా మోయకతప్పదు."

### పాలనాసమస్యల పరిష్కారం

ఫ్రాన్సులోవలె పరిపాలనా సమస్యల పరిష్కార సంఘాలను నియమించాలని కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నది. పన్ను మదింపులమీద, కార్మిక వివాద తీర్పుల మీద వచ్చే రిట్‌ల సత్వర పరిష్కారం కోసం వీనిని ఏర్పాటు చేస్తున్నారు. కార్మిక న్యాయస్థానాలు ఇచ్చే తీర్పులను రిట్‌ల ద్వారా అమలు కాకుండా చేస్తున్నారు. దీనికి ఎక్కడో అక్కడ అంతం వుండాలి. వ్యక్తి హక్కులకు న్యాయశాస్త్ర నిర్వచనానికి సంబంధించినంతవరకు సుప్రీంకోర్టు ప్రధాన న్యాయస్థానములకు అధికారం వుండవలసిందే. ఇందుకు సుప్రీం కోర్టు, ప్రధాన న్యాయస్థానాల అధికారాలను కొంత మార్చవలసి వుంటుందని కృష్ణమాచారి అన్నారు.

జాతీయ ప్రావిడెంటు ఫండ్ నిధిని ఏర్పాటుచేసి ఆ నిధితో గృహ నిర్మాణ పథకాలను అమలుజరపటానికి ప్రభుత్వము ఆలోచిస్తున్నదని కూడా కృష్ణమాచారి చెప్పారు.

మరికొన్ని ప్రశ్నలకు సమాధానం ఇస్తూ విదేశాంగ సెక్యూరిటీవాతావరణం కొంచెం బాగుపడిందనీ, కొంత విశ్వాసం కలిగించగలిగామని శ్రీ కృష్ణమాచారి చెప్పారు. 1958 గడిచిందా మనకు విశేషాలలోనే కావలసినంత అప్పు పుట్టుతుందని అన్నారు.

అంతకుముందు కేంద్ర ఆర్థికమంత్రి నగరంలోని వర్తకులను కలుసుకొని పన్ను ప్రతిపాదనలను గూర్చి చర్చించారు.

## రష్యాలో జర్మనులు

### బాన్‌కు మాస్కో లేఖ

బాన్, జులై 8: రష్యాలో కొన్ని వేలమంది జర్మనులు వున్నారంటూ బాన్ ప్రభుత్వం వెల్లడించిన భావాన్ని, రష్యా నేడు ఖండిస్తూ ఒక ఉత్తరాన్ని పశ్చిమ జర్మనీకి అందచేసింది.

ఉత్తరంలో ఇలా వుంది: రష్యాలో ఖైదీలుచేసి, శిక్షలు పొందిన జర్మనులను అందరినీ మేము పంపించివేశాము. ఇక మిగిలిందల్లా కొద్దిమంది జర్మన్ పౌరులు మాత్రమే. వీరి విషయాన్ని మనం చర్చించుకోవచ్చు. అంతేగాని, వేలకొద్ది జర్మనులు రష్యాలో వున్నారనే వాదాన్ని మేము అంగీకరించము."

# అణుయుగానికి తగ్గట్లు మనుష్యులు మార్పుకోవాలి

## ప్రపంచాన్ని పీడిస్తున్న భీతిని నివారించాలని నెహ్రూ వినతి

దిహేగ్, జూలై 8: "చరిత్రలో అణుయుగంగా పేరొందగల నేటి కాలానికీ, ఆధునిక ప్రపంచవ్యవస్థకూ, అనుగుణంగా మనుష్యులు మనస్సులు మలచుకోడం నేడు ముఖ్యావసరం; ప్రపంచ వ్యవస్థ పునాదులను చలింపచేస్తున్న మానవుల నిత్య భీతిని నివారించడం నేడు ప్రధాన కర్తవ్యం" అని భారత ప్రధాని శ్రీ జవహర్లాల్ నెహ్రూ అన్నారు.

నెదర్లాండ్స్ (హాలండ్) ప్రభుత్వం ఇవాళ రాత్రి ఇచ్చిన విందు సందర్భంలో శ్రీ నెహ్రూ పై విధంగా అన్నారు.

విందులో హాలండ్ ప్రధాని డా॥ విలెంద్రీస్ శ్రీ నెహ్రూకు స్వాగతం చెప్తూ వారు తమదేశం వచ్చినందుకు ఆనందం ప్రకటించారు. శ్రీ నెహ్రూ హాలండ్‌లో రెండు రోజుల కంటె మించి ఉండాలని తమకు కోరిక ఉన్నప్పటికీ, వీలుండదని గ్రహించినట్లు శ్రీ డ్రీస్ చెప్పారు.

పురాతన భారతీయ సంస్కృతిపట్ల హాలండ్‌లో విశేష గౌరవాదరాలున్నాయని శ్రీ డ్రీస్ అన్నారు. ఈ నాటి భారతదేశం సాధించిన ఘన కార్యాలపట్ల ప్రశంస, భారతీయులపట్ల అభిమానం కూడా ఉన్నాయి, అంటూ శ్రీ డ్రీస్ ఇలా అన్నారు.

"మహాపురుషుడైన గాంధీజీతో ...

దేశం ప్రక్కరిపిఉన్నమాట నిజమే; కాని స్వతంత్రం సుభిక్షమైన సామాజిక వ్యవస్థ నిర్మాణంలో భారతదేశం సాధించవలసిన బృహత్ సమస్యతో పోల్చిచూసుకుంటె, మా ఆర్థిక సామాజిక సమస్యలు అత్యల్పాలు.

"అయితే, జనాభా సంఖ్యలు చేసే వైశాల్యాలనే ప్రమాణాల దృష్టితో కాకుండా, ఇవి దేశాలు, జాతులు, ఇవి సమాజాలు, వీరు మనుష్యులు అనే దృష్టితో చూస్తే, మన ఉభయదేశాలలోనూ, ప్రజల అవసరాలూ వాంఛలలో ఎన్నో సమాన లక్షణాలున్నాయి. మనదేశాలమధ్య సహానుభూతి అవసరాన్ని బట్టి కాదు, సహజంగానే ఉంటుంది."

భారతదేశం సమస్యలను అర్థం చేసుకోగల మిత్రులు ఈ దేశంలో ఉన్నారని ఈపర్యటనలో మీరే బోధపడుతుంది, అని కూడా శ్రీ డ్రీస్ అన్నారు.

### శాంతిసాధనకు అదే తరుణం

### మానవనిర్మితమైన దేశం

### నెహ్రూ ఆగమనం

# భారత్ పాకిస్తాన్ సమస్యల పరిష్కారానికి బ్రిటన్ తోడ్పాటు

## కాశ్మీర్‌లో పాక్ దురాక్రమణను గుర్తిస్తే, సాధ్యమని మీనన్ ప్రకటన

లండన్, జూలై 8: కాశ్మీర్ వ్యవహారం విషయంలో బ్రిటన్ తిన్నగా వ్యవహరించగలిగితే, భారతదేశం పాకిస్తాన్‌లమధ్య తగాదాలను పరిష్కారం చెయ్యడానికి, బ్రిటన్ తోడ్పడగలుగుతుందని భారత రక్షణమంత్రి శ్రీ కృష్ణమీనన్ నేడు ఇక్కడ వివరించారు.

కాశ్మీర్ విషయంలో సవ్యంగా వ్యవహరించడం అంటే ఏమిటో కూడా ఆయన ఈసందర్భంలో వివరించారు. కాశ్మీర్ తగాదా స్వామిని గూర్చిన తగాదా కాదని, పాకిస్తాన్ దురాక్రమణ చెయ్యడం వల్ల వచ్చినతగాదాఅని బ్రిటన్ గుర్తించాలన్నారు. అట్లా గుర్తించిననాడు, ఈసమస్యవిషయంలో తక్కిన అన్ని సమస్యలనూ, ఈ రెండు దేశాలు పరిష్కరించుకోడానికి బ్రిటన్ ...

ఈ సమస్య తీరడానికి కాలం పడుతుంది. కుదిరింపాడ ఇది సవ్యంగా పరిష్కారం అవుతుందన్న ఆశ నాకువుంది."

శ్రీ మీనన్ ప్రసంగంలో మరికొన్ని ఇతర అంశాలు వున్నాయి. వాటిని గూర్చి ఆయన ఇల్లా చెప్పారు: "భారతదేశం విదేశాంగవిధానంలో విజాతీయమైంది ఏమీ లేదు. ఇతర దేశాలతో వుంచవలసిన సంబంధాలను గురించి జాతీయమైన విధానం ఏమిటో అదే అందులో వుంది.

"ప్రపంచం శాంతంగా వుండాలన్న భారతదేశం శాశ్వతలక్ష్యం. అంటే, ప్రపంచంలో తనకేమో విశిష్టవ్యక్తిత్వం వున్నదని, విశిష్ట కార్యభారాన్ని నిర్వహించాలని ...

### అంతరిస్తున్న అవరోధాలు

# స్టాలినిస్టుల కుట్ర

(1 వ పుట తరువాయి)

వీలు లేదని ప్రకటించారు.

ఆ కారణంచేత పార్టీ విధానం నిర్ణయించే వ్యవస్థ అయిన కేంద్ర సంఘాన్ని వెంటనే సమావేశపరచాలని వారు కోరారు.

"ఎంత వారించినా ఆ రోజున అధ్యక్షమండలి సభ్యులతో కొందరితో మాట్లాడే అవకాశం మాత్రమే వారికి లభించినది.

"ఆ మరుసటి రోజు అధ్యక్షమండలి ఇంకా సమావేశంలో ఉండగానే రాష్ట్రాలలో నివసించే కేంద్ర సంఘ సభ్యులు మాస్కోకు రావడం మొదలు పెట్టారు. వారందరు కేంద్ర సంఘ సర్వసభ్య సమావేశం వెంటనే ఏర్పాటు చేయాలని కోరే దృఢసంకల్పంతో వచ్చారు.

"ఆ ఒక్క రోజున మాస్కో చేరుకొన్న కేంద్ర సంఘ సభ్యుల సంఖ్య 107. ఆ నలుగురు నాయకులు కేంద్ర సంఘం సమావేశం కాకుండా నిరోధించడానికి మరొక పర్యాయం ప్రయత్నించారు. కాని, అంతమంది సభ్యులు బాహాటంగా సమావేశం జరగాలని కోరుతున్నప్పుడు వారు చివరికి ...

### కేంద్ర సంఘ సమావేశం

### ఆసియా అణుశక్తి కేంద్రం

#### తొందరకూడదని హితవు

### బల్గేరియా పార్టీ సమర్థన

# 'ప్రజాస్వామ్యానికి తార్కాణం'

రోమ్, జూలై 7: నలుగురు సోవియెట్ కమ్యూనిస్టు నాయకుల బర్తరఫ్ రష్యాలో ప్రజాస్వామ్యం ఉన్నదని చెప్పడానికి తార్కాణంగా ఉన్నదని ఇటలీ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు శ్రీ పామైరో టోగ్లియాటి ఈరోజున ప్రకటించారు. 'యూనిటా' పత్రికలో ప్రచురితమైన వ్యాసంలో ఆయన ఇంకా ఇలా చెప్పారు: "సమష్టి నాయకత్వం పునరుద్ధరించాలనే దృఢనిశ్చయానికి ఇతర దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలకు రాజకీయ నాయకత్వం చేపట్టడానికి తమ ఇచ్చవచ్చిన మార్గాలు అనుసరించే స్వతంత్రం ఉన్నదని చెప్పడానికి కూడా ఈచర్య ఆధారం."

# 'గృహ కల్లోలం'

హ్యూరెంబర్గ్, జూలై 7: నలుగురు సోవియెట్ నాయకుల బర్తరఫ్‌కు సంబంధించిన సంఘటనలు 'గృహ కల్లోలం' వంటివని పశ్చిమజర్మనీ ప్రధానమంత్రి డా॥ కొన్రాడ్ ఎడినోవర్ ఈరోజున అన్నారు.

లండన్‌లో నిరాయుధీకరణ గురించి జరుగుతున్న చర్చలలో సోవియెట్ ప్రతినిధి చేసే ప్రసంగం చూచినతరువాత ...

### కారణం తెలియదని డల్లెస్ వ్యాఖ్య

తనకు నలుగురు సోవియెట్ నాయకులు బర్తరఫ్ అయిన సంగతి తెలిసినదని శ్రీ డల్లెస్ సూచించారు.

వాషింగ్టన్‌కు విమానంలో వస్తూ, మాస్కోలోని అమెరికా రాయబారి ఆ విషయమై పంపిన నివేదికలను, ఇతర దేశాల రాజధానులనుంచి చేరిన సమాచారాన్ని పరిశీలించినట్లు ఆయన అన్నారు.

"కొందరు సోవియెట్ నాయకులకు కాలము, పరిస్థితులు అనుకూలించినట్లు" తనకు గోచరిస్తున్నదని కూడా శ్రీ డల్లెస్ చెప్పారు.

# ప్రాగ్‌కు సోవియెట్ నాయకుల ప్రయాణం

పారిస్, జూలై 8: సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి శ్రీ నికిటా కృష్చేవ్, ప్రధానమంత్రి శ్రీ నికొలాయ్ బుల్గానిన్ ఈరోజున మాస్కోనుంచి విమానంలో ప్రాగ్‌కు బయలుదేరినట్లు మాస్కో రేడియో ప్రకటించినది.

విమానాశ్రయం వద్ద కమ్యూనిస్టు పార్టీనాయకులు, మంత్రులు, విదేశీ రాయబార కార్యాలయాల ప్రతినిధులు వారికి వీడ్కోలు ఇచ్చారు.

# రష్యాకు యుగోస్లావ్ నాయకుల ప్రయాణం

### చెకొస్లొవేకియాలో పర్యటన

... ఢక్ ద్వీపంనుంచి ఇక్కడికి తిరిగి వచ్చిన సమయంలో రష్యాలో సంఘటనలపై వ్యాఖ్యానిస్తూ ఆయన పై విధంగా చెప్పారు.

మాస్కో రేడియో ప్రకటించిన మాదు రోజులకు శనివారం నాడు ...

... హంగేరి సరిహద్దువద్ద ఉన్న సిరియాన్ని చేరుకుంటారని తెలుస్తున్నది.

మార్గ మధ్యంలో కొలదిసేపు కోసిగే జిలినోలవద్ద ఆగుతారు. రైల్వేస్టేషన్లు అన్నీ సోవియెట్ పతాకలతో అలంకరించారు.

# అణ్వస్త్రాలపైన పాశ్చాత్య ప్రతిపాదనలు నిరుపయోగం

## జోరిన్ స్పష్టీకరణ: రష్యా సూచనలను ఆమోదించవలసిందని విజ్ఞప్తి

లండన్, జూలై 8: అణ్వస్త్ర పరీక్షల నిలుపుదలను గురించి, అణ్వస్త్రోత్పత్తిని గురించి, పశ్చిమ రాజ్యాలవారు చేసిన ప్రతిపాదనలు ఎందుకూ కొరగానివిగా వున్నాయని రష్యా ప్రతినిధి శ్రీ జోరిన్, నేడు సమితి నిరాయుధీకరణ ఉపసంఘంలో మాట్లాడుతూ అన్నారు.

పరీక్షలు ఆపడానికి, అణ్వస్త్రోత్పత్తిని ఆపడానికి గూడా పాశ్చాత్య రాజ్యాలు షరతులుపెట్టి, అసలు విషయం సున్నా అయిపోయేట్లు చేశాయి అని శ్రీ జోరిన్ ఆ ప్రతిపాదనలను విమర్శించారు.

అయుధ విసర్జన విషయంలో ఒప్పందం కుదరకుండా వుండడానికి పాశ్చాత్య రాజ్యాలు ఎత్తులు వేస్తున్నాయని విమర్శించారు.

"అణ్వస్త్రాలను వాడము అని అగ్ర రాజ్యాలు వాగ్దానం చెయ్యాలి అని మేము సూచించాము. అట్టి వాగ్దానం చెయ్యడం వారికి ఇష్టం లేదు. అందుచేత, ఈ అణ్వస్త్ర వ్యవహారాన్ని, ఇంకా ఎన్నో ఇతర సమస్యలతో తీసుకువెళ్ళి ముడిపెడుతున్నారు. ఇది సబబు కాదు. ఉచితం కాదు. ఒకరు అంగీక ...

# బుచ్చియప్ప నాయుడి మృతి

## రాష్ట్ర శాసనసభ సంతాపం

# ఆహార పదార్థాల కల్తీ

## నిరోధానికి ఉత్పత్తి కొను గోలు దార్ల సంఘాలు

మధురై, జూలై 8: ఆహార పదార్థాల కల్తీని నిరోధించేందుకు, ప్రభుత్వం ఉత్పత్తి కొనుగోలు దారులలో ఒక సంఘాన్ని ఏర్పాటు చేయాలని, పోటీ కాంగ్రెస్ సంఘం నతిరాత్రి ఇక్కడ సమావేశమై తీర్మానించింది.

ఈ కల్తీ క్రమంగా పెరిగిపోతున్నదంటూ, దీనిమూలంగా ప్రజల ఆరోగ్యం దెబ్బతింటున్నదని యీ తీర్మానంలో తెలియచేశారు.



# రిపబ్లికన్ పార్టీ నాయకత్వం

## ఖాన్‌సాహెబ్ స్థానే రషీద్ ఎన్నిక

### నూతన నాయకునితో గవర్నరు చర్చలు

కరాచీ, జూలై 8: పశ్చిమ పాకిస్థాన రిపబ్లికన్ పార్టీ నాయకత్వం నుండి డాక్టర్ ఖాన్‌సాహెబ్ వైదొలగి ఆ స్థానంలో సర్దార్ అబ్దుల్ రషీదును నియమించినట్లు తెలుస్తోంది.

ఇదివరలో రద్దు అయిన ఖాన్‌సాహెబ్ మంత్రి వర్గంలో శ్రీ రషీద్ ఆర్థికశాఖా మంత్రిగా ఉన్నారు. వాయవ్య సరిహద్దు రాష్ట్రానికి ఇదివరలో ముఖ్యమంత్రిగా కూడా వ్యవహరించారు. తమస్థానంలో శ్రీ రషీద్‌ను నియమించినట్లు గవర్నరు శ్రీ గుర్మానికి కూడా ఖాన్‌సాహెబ్ తెలియజేశారని తెలిసింది. రాష్ట్రంలో మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయమని రిపబ్లికన్ పార్టీ నిర్ణీత పక్షంలో శ్రీ రషీద్‌ను ఆహ్వానించవలసిందని కూడా ఆయన తెలిపారు.

ఈ ఉత్సవాలు ముగిసిన అనంతరం, వచ్చే వారంలో తమను కలిసికొనవలసిందిగా శ్రీ రషీద్‌ను గవర్నరు కోరారని లాహోర్‌లోని రిపబ్లికన్ వర్గాల ద్వారా తెలిసింది. తిరిగి రాష్ట్రంలో తమ పార్టీ మంత్రివర్గం ఏర్పడుతుందని వీరు అంటున్నారు.

పాకిస్థాన్ అధ్యక్షుడు శ్రీ మీర్జాతో గవర్నర్ శ్రీ గుర్మానీ, ఖాన్‌సాహెబ్ ప్రభృతులు జరిపిన సంప్రదింపుల ఫలితంగా ఈ పార్టీ నాయకత్వంలో మార్పు వచ్చినట్లు తెలుస్తోంది. ఈ నెల 3వ తేదీనే ఈ క్రొత్త నాయకుని ఎన్నిక జరగవలసి ఉంది. కాని నాయకుని విషయంలో రిపబ్లికన్ శాసన సభా పార్టీలో ఏకగ్రీవాభిప్రాయం లేక అప్పుడు నిర్ణయాన్ని వాయిదా వేశారు. శ్రీ రషీద్ వయస్సు 51 సంవత్సరాలు. ఈయన ఖాన్‌సాహెబ్‌కు కుడిభుజం వంటివాడు. పార్టీలో ఈయన చాలగట్టివాడని ప్రతీతి. రషీద్ ముఖ్యమంత్రి అయితే, మంత్రివర్గ నిర్మాణంలో కొన్ని ప్రాథమికమార్పులు ఉంటాయని అనుకొంటున్నారు.

అయితే, శ్రీ రషీద్‌ను నాయకుని గా నియమించడంవల్ల ముస్లింలీగ్ పార్టీలో ఆందోళన కలిగింది. పంజాబ్, సింధురాష్ట్రాల సభ్యులలో చాలమందికి ఈయనపై విశ్వాసం లేదనీ, అందువల్ల పార్టీలో చీలికలు వస్తాయనీ వీరు అనుకొన్నారు. రిపబ్లికన్‌పార్టీలో కలిగే కలతలవల్ల, ముస్లింలీగు పార్టీచేత నే మంత్రివర్గం ఏర్పాటు చేయిస్తారని కూడా వీరు భావించారు.

# పంజాబ్ హిందీ ఉద్యమం

## కొనసాగించాలని రక్షా సమితి నిర్ణయం

న్యూఢిల్లీ, జూలై 7: సార్వదేశిక భాషా స్వతంత్ర సమితి, పంజాబ్ హిందీ రక్షాసమితి యిక్కడ సమావేశమై శ్రీ నెహ్రూ యిటీవలి లేఖకు తమ సమాధానం పంపే విషయమై చర్చలు జరిపాయి. రక్షా సమితి నాయకుడు స్వామి ఆత్మానంద్, పంజాబ్‌లో కొనసాగిస్తున్న ఉద్యమాన్ని విరమించాలంటూ శ్రీ నెహ్రూ తమ లేఖలో కోరారు. వీరికి పంపే సమాధానాన్ని తయారు చేసేందుకు ఒక ఉపసంఘం ఏర్పాటైంది.

హిందీ రక్షా సమితి ప్రత్యేకంగా సమావేశమై ఉద్యమాన్ని కొనసాగించాలని నిర్ణయించింది.

# పంజాబ్‌లో భాషా విషయమై ఆందోళన

## విరమించాలని ప్రముఖుల వినతి

న్యూఢిల్లీ, జూలై 7: ప్రధాని శ్రీ నెహ్రూ స్వామి ఆత్మానందజీ సరస్వతికి వ్రాసిన ఉత్తరం వల్ల పంజాబీల పురోభివృద్ధిని ఆయన హృదయపూర్వకంగా కోరుతున్నట్లు స్పష్టమవుతోందనీ, అందువల్ల ప్రస్తుతం రాష్ట్రంలో భాషావిషయమై సాగిస్తున్న ఆందోళనను విరమించాలనీ పలువురు ప్రముఖ పంజాబీనాయకులు సంయుక్తంగా ఆ ఉద్యమ నాయకులకు విజ్ఞప్తి చేశారు.

# లండన్‌లో డా॥ నారాయణి వివాహం

లండన్, జూలై 6: భారత రక్షణ శాఖ మంత్రి శ్రీ వి. కె. కృష్ణమీనన్ మేనకోడలు డా॥ నారాయణికి, కలకత్తా వాస్తవ్యుడు శ్రీ హిరన్‌కుమార్ చటర్జీతో ఇవేళ యిక్కడ వివాహం జరిగింది.

డాక్టరు నారాయణి మద్రాసు విశ్వవిద్యాలయంలో వైద్య విద్యా పట్టం పొంది ఇక్కడ ఉన్నత విద్యను అభ్యసిస్తున్నారు. శ్రీ చటర్జీ "ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్"లో డాక్టరేట్ పట్టంకోసం పరిశోధన జరుపుతున్నారు.

వీరి వివాహం వాండ్స్‌వర్త్ పుర మందిరంలో జరిగింది. మధ్యాహ్నం శ్రీ కృష్ణమీనన్ విందు ఏర్పాటు చేశారు. ఆ సేకమంది మిత్రులు హాజరయ్యారు.

విజయవాడలో కృష్ణాపుష్కరం పారిశ్రామిక సాంస్కృతిక వ్యావసాయిక ప్రదర్శనను మంత్రి శ్రీ కొండా వెంకటరంగారెడ్డి ఇటీవల ప్రారంభోత్సవం చేశారు.

వరంగల్లు పురపాలక సంఘ అధ్యక్షుడుగా ఇటీవల ఏకగ్రీవంగా ఎన్నుకోబడిన శ్రీ చెరుకు కొంతయ్యగారు.

# కాశ్మీర్‌లో పాక్ ఏజంట్ల చర్యలు

## తీవ్రప్రమాద మున్నదని డోగ్రా హెచ్చరిక

బరోడా, జూలై 7: కాశ్మీర్‌లో పాకిస్తాన్ ఏజంట్లు కొనసాగిస్తున్న విద్రోహచర్యలు బరి తెగి పోయాయని జమ్మూ, కాశ్మీర్ పరిషత్తు అధ్యక్షుడు పండిత ప్రేమనాథ్ డోగ్రా తెలియజేశారు.

జమ్మూ, శ్రీనగరాలలో యిటీవల సంభవించిన ప్రేలుళ్లను ప్రస్తావిస్తూ, ముందు ముందు యింకా ప్రమాదకర సంఘటనలు జరుగడలవనటానికి యివి సూచనలని శ్రీ డోగ్రా హెచ్చరించారు. ఈ కుట్రను సమూలంగా ధ్వంసం చేయటంలో ప్రభుత్వం యింతవరకు విఫలం అయిందని వీరు విమర్శించారు.

భారత రాజ్యాంగం, కాశ్మీర్‌కు పూర్తిగా అన్వయించాలని కూడా కోరారు.

# బ్రిటిష్ సైనికుల చర్య: రష్యాకు క్షమాపణ

కొలంబో, జూలై 8: సోవియట్ రాయబార కార్యాలయ కొనపై ఎగురుతున్న రష్యన్ పతాకాన్ని ముగ్గురు బ్రిటిషు సైనికులు 4వ తేదీన తీసి వేశారని ఫిర్యాదు వచ్చినందున శ్రీలంక ప్రభుత్వం, బ్రిటిషు రాయబార కార్యాలయము, సోవియట్ రాయబార కార్యాలయంవారికి క్షమాపణలు చెప్పుకున్నట్లు అధికారవర్గాల ద్వారా తెలిసింది.

ఈ ముగ్గురు సైనికులలో ఇద్దరు శ్రీలంకనుంచి అప్పుడే వెళ్లిపోయారు.

మూడవవ్యక్తి సైన్యంలో చిన్న వుద్యోగి. ఈయనను పోలీసులు నిర్బంధంలో వుంచారు. తరువాత జామీనుపై వదిలారు. (హాంగ్ కాంగ్ నుంచి లండనుకు నౌకలో పోతూ మార్గమధ్యంలో ఇక్కడ యీ సైనికులు ఆగవలసి వచ్చింది.)

# నేపాల్ ప్రధాని రాజీనామాకు సంసిద్ధత

ఖాట్మండు, జూలై 7: ఐక్యత సాధించే రీతిని ప్రభుత్వాన్ని పునర్నిర్మించే అవకాశం ఈయడమో, లేక తమ మంత్రివర్గ రాజీనామాను ఆమోదించడమో నిర్ణయించవలసిందని నేపాల్ రాజును ప్రధాని టంక ప్రసాద్ ఆచార్య కోరినట్లు తెలిసింది. ఈరీతిని రాజుకు సూచించమని ప్రభుత్వపక్షమైన నేపాల్ ప్రజాపరిషత్తు ప్రధానిని ఆదేశించింది. ప్రభుత్వ పునర్నిర్మాణానికి అవకాశం ఈయక పోతే, రాజీనామా ఈయాలని ఈ పక్షం నిర్ణయించింది.

ప్రధాని రాజీనామాను సమర్పించాలనీ, నిర్ణయం జరిగే వరకు అధికారంలో ఉండమని ఈయనను రాజు కోరారని కూడా తెలిసింది. దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థను నెలకొల్పడంలో తాము అధికారం కోల్పోవడానికి కూడా సిద్ధమేనని శ్రీ ఆచార్య అన్నారు. ఇంతకుమించి ఆయన ఏమీ చెప్పలేదు.

నిన్న సాయంత్రంతోను నేపాల్ రాజు సంప్రదింపులు జరుపుతున్నారు. ఒక కనీస కార్యక్రమంపై జాతీయ మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటుకు ప్రజా పరిషత్తు సుముఖంగా ఉన్నదని తెలుస్తోంది.

# ప్రభుత్వానికి సంబంధంవున్న పరిశ్రమలు, వ్యాపారాలు

## లోపాలువుంటే, పరిశీలన చేయించి సరిదిద్దుతామని ముఖ్యమంత్రి హామీ

హైదరాబాదు, జూలై 8: ప్రభుత్వానికి సంబంధం వున్న పరిశ్రమలను గురించి, ప్రభుత్వానికి వాటాలు వున్న పరిశ్రమలను గురించి, విచారణ జరిపించడానికి రాష్ట్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి నేడు ప్రశ్నోత్తరాల సమయంలో వెల్లడి చేశారు.

అయితే, ఈ విచారణ ఎట్లా జరిపించాలి, ఎప్పుడు జరిపించాలి అనే విషయమై ఇంకా తుదనిర్ణయం జరగలేదని, ఈ విచారణ జరిపించేందుకు ఒక సంఘాన్నిగూడా వెయ్యాలని నిర్ణయం గూడా జరగలేదని ఆయన చెప్పారు.

సభవారికి ఆయన ఈ సందర్భంలో ఒక హామీ ఇచ్చారు. ప్రభుత్వానికి సంబంధంవున్న పరిశ్రమలలో గాని, వ్యాపారాలలో గాని, లోపాలువుంటే, వాటిని గూర్చి విచారణ జరుగుతుంది. ఆ లోపాలను సరిదిద్దడం జరుగుతుంది అని చెప్పారు.

రాష్ట్రంలో ప్రభుత్వం స్వంత పరిశ్రమలు ఒక ఐదుదాకా వున్నాయని, ఇందులో మూడింటిని ప్రభుత్వ మేవాణిజ్యపరిశ్రమలశాఖ డైరెక్టరుచేత స్వంతంగా నడిపిస్తున్నదని, తక్కిన రెండు పరిశ్రమలలో ఒకదానిని హైదరాబాదు కన్‌స్ట్రక్షన్ కంపెనీ కాంట్రాక్టుపద్ధతిని నడుపుతోందని, ఇంకో పరిశ్రమను శ్రీమతి అలీహైదరీ నడిపిస్తున్నదని ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి.

రాష్ట్రంలో ప్రభుత్వం స్వంతం పరిశ్రమలు ఇవి. (1) ఆంధ్ర పేపరు మిల్లులు, రాజమండ్రి (2) గవర్నమెంటు సెరమిక్ ఫ్యాక్టరీ, గూడూరు (3) గవర్నమెంటు గ్లాసు వర్క్సు, గూడూరు (4) పవర్ ఆల్కహాల్ ఫ్యాక్టరీ బోధన్ (5) నిర్మల్ పరిశ్రమలు, హైదరాబాదు. ఇందులో ప్రభుత్వం స్వంతంగా నడిపిస్తున్నవి: (1) ఆంధ్ర పేపరుమిల్లులు (2) గవర్నమెంటు సెరమిక్ ఫ్యాక్టరీ (3) గవర్నమెంటు గ్లాసుఫ్యాక్టరీ.

బోధన్‌లోని పవర్ ఆల్కహాల్ ఫ్యాక్టరీని హైదరాబాదు కన్‌స్ట్రక్షన్ కంపెనీకి కాంట్రాక్టు ఇచ్చారు. ఈ కాంట్రాక్టును ప్రభుత్వం ఎప్పుడుపడితే అప్పుడు రద్దుచేయవచ్చు. అదీకాక హైదరాబాదు కన్‌స్ట్రక్షన్ కంపెనీలోగూడా ప్రభుత్వానికి వాటాలు వున్నాయి. ఆ కంపెనీ యజమాని వర్గంమీద ప్రభుత్వానికి పర్యవేక్షణాధికారాలు వున్నాయి.

నిర్మల్ పరిశ్రమ శ్రీమతి అలీహైదరీ యాజమాన్యంలో వుంది. అందుకు ఆవిడ నెలకు ఇంత అని పుచ్చుకుంటుంది. పైన కమిషన్‌గూడా ఆవిడకు లభిస్తుంది. ఇక్కడ ఈ యాజమాన్యాన్ని పర్యవేక్షించేందుకు ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. అయినా ఈ పరిశ్రమ వ్యవహారాలు నిత్యము ప్రభుత్వం పరిశీలనకు వస్తూనే వున్నాయి.

సభ్యులు వేసిన ఉపప్రశ్నలకు సమాధానం ఇస్తూ ముఖ్యమంత్రి ఇలా చెప్పారు: గూడూరులోని గవర్నమెంటు గ్లాసుఫ్యాక్టరీలో ప్రస్తుతం పని జరగడంలేదు. గ్లాసుపనుల్లో తగిన నిపుణుకు లభించేవరకు అక్కడ పని ప్రారంభం కాదు. అక్కడే వున్న సెరమిక్ ఫ్యాక్టరీ వ్యవహారాలు సంతృప్తికరంగా వున్నాయి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య వేసిన ఒక ప్రశ్నకు సమాధానం ఇస్తూ, తెలంగాణాలో పరిశ్రమల వ్యవహారాలను గురించి విచారణ సాగుతోందని, అన్ని పరిశ్రమల సంగతి విచారించడానికి ప్రభుత్వం సంఘాన్ని నియమించదనీ కొన్ని కొన్ని పరిశ్రమల విషయంలో ప్రభుత్వం కొన్ని నిర్ణయాలు గూడా చేసిందని శ్రీ సంజీవరెడ్డి చెప్పారు.

ప్రతిపక్ష పరిశ్రమనుగూర్చి ఉన్న పళంగా అన్ని సంగతులు చెప్పవలసిందని కోరడం సబబుకాదని, తానుఅట్లా చెప్పనని అన్నారు. సభ్యులకు సంగతులు తెలుసుకోవాలని వుంటే, ప్రతి ఒక్క పరిశ్రమనుగూర్చి ప్రశ్న వేసి, తెలుసుకోవడం మంచిది అని సలహా ఇచ్చారు.

మీరు ఈ పరిశ్రమలశాఖను తీసుకున్నప్పుడు వీటిని అన్నింటినిగూర్చి, విచారణ జరిపించడానికే తీసుకున్నారని అంటున్నారు అనగా, అది నిజం కాదని ముఖ్యమంత్రి జవాబుచెప్పారు. పూర్వం నాకు ప్రణాళికలు, అభివృద్ధి శాఖ వుండేది. దాన్నిమార్చి దీన్ని తీసుకున్నాను. ఈ పరిశ్రమలశాఖలో పని కొంచెం తక్కువ. ప్లానింగుశాఖ విషయం అట్లాకాదు. అందుచేత యీ మార్పిడి జరిగింది అని చెప్పారు.

శ్రీ సంజీవరెడ్డి ఒక్క ముఖ్యమంత్రే గాక వాణిజ్య, పరిశ్రమల మంత్రి గూడాను.

# దేవాదాయ చట్టం

వెనుకటి ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం శ్రీ తెన్నేటి విశ్వనాథం అధ్యక్షులుగా నియమించిన అనధికార సంఘం, మద్రాసు హిందూ మతాదాయ ధర్మసంస్థల చట్టానికి కొన్ని సవరణలు సూచించిందనీ, యీ సవరణలు వంశపారంపర్యమైన ధర్మకర్తలకు, ఆ విధంగా గాని ధర్మకర్తలకు సంబంధించినవనీ, వీటిని గురించి ప్రభుత్వం ఇప్పుడు ఆలోచిస్తున్నదని, మంత్రి శ్రీ వెంకటరెడ్డినాయుడు, శ్రీ బి. శంకరయ్య అడిగిన ప్రశ్నకు జవాబిచ్చారు. మఠ, ధర్మ సంస్థల నిర్వహణను, పంచాయతీలు నియమించి ఉపసంఘాల ద్వారా జరిపించాలనే విషయం ప్రభుత్వం ఆలోచించడం లేదని కూడా మంత్రి చెప్పారు.

# కార్మిక న్యాయస్థానం తీర్పుల నిర్లక్ష్యం

1955-56 లో కార్మిక న్యాయస్థానా లిచ్చిన తీర్పులను 15 మంది యజమానులు ఉల్లంఘించారనీ, వారిలో 5 గురిపై పారిశ్రామిక వివాదాల చట్టం క్రింద వ్యవహారం జరుగుతోందని, మిగతా వారిపై కూడా చర్య తీసుకుంటారనీ కార్మిక మంత్రి శ్రీ డి. సంజీవయ్య శాసనసభలో శ్రీపి. గోపాలకృష్ణారెడ్డి ప్రశ్నకు బదులు చెప్పారు.

# రైతులకు 99 లక్షల అప్పు

వ్యవసాయ భూముల అభివృద్ధిచట్టం క్రింద 1955 లో - తెలంగాణా ప్రాంతంసహా రాష్ట్రమంతటా రైతులకు రు 99లక్షలు అప్పుగాయివ్వడమైందని రెవెన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు శ్రీ ఎం. నాగిరెడ్డి ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

# గీతపనివారికి అబ్కారీ కంట్రాక్టులు

గీత పనివారి సహకార సంఘాలకు, అబ్కారీ కంట్రాక్టులు ఇచ్చే విషయం ప్రభుత్వం ఆలోచిస్తోందని, నాలుగైదు రోజుల్లో నిర్ణయమౌతుందని, రెవెన్యూ మంత్రి శ్రీ కళా వెంకట్రావు శాసన సభలో శ్రీమతి ఆరుట్ల కమలాదేవి ప్రశ్నకు బదులు చెప్పారు. తెలంగాణాలో, వరంగల్‌లోని సహకార సంఘంకూడా కలుపుకొని మొత్తం ఐదారు గీతపని వారి సహకార సంఘాలున్నాయని మంత్రి చెప్పారు.

# కొడూరులో ఫల పరిశోధన కేంద్రాలు

హైదరాబాదు, జూలై 8: కేంద్ర వ్యవసాయ పరిశోధనాసంఘం ఆంధ్ర ప్రదేశ్‌కు క్రొత్తగా రెండు ఫలపరిశోధన కేంద్రాలను (ఒకటి పెద్దది, ఒకటి చిన్నది) మంజూరుచేసిందని, వీటిని బహుశః కొడూరులో నెలకొల్పటం జరుగుతుందనీ రాష్ట్రవ్యవసాయమంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ఇవేళ శాసనసభలో శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యకు తెల్పారు.

పై రెండు కేంద్రాలలో ముఖ్యంగా మామిడి, నిమ్మఫలాలపై పరిశోధన జరుగుతుందని మంత్రి వివరించారు.

# సోషలిస్టుపార్టీ లోహియాపార్టీకాదు

## రాష్ట్ర శాసనసభలో సభ్యుని ఆక్షేపణ

హైదరాబాదు, జూలై 8: ఆంధ్రప్రదేశ్ శాసనసభలో సోషలిస్టుపార్టీ సభ్యుడు శ్రీ బి. శ్రీరామమూర్తి, తనను ఒక స్థానిక తెలుగు దిన పత్రిక లోహియాపార్టీసభ్యుడుఅని వ్రాయటం, దురుద్దేశ్యంతో తనను, తనపార్టీని అప్రతిష్ఠపాలు చేయడానికి చేసినపని అని, యీ పత్రిక శాసనసభ సభ్యునిగా తన హక్కును, సభాగౌరవాన్ని భంగపరచిందని కొబట్టి యీ విషయాన్ని, హక్కుల సంఘానికి నివేదించాలని సభాపతిని కోరారు.

మరో సోషలిస్టు సభ్యుడు శ్రీ టి. వి. ఎస్. పద్మనాభరాజు మాట్లాడుతూ డా॥ లోహియా పార్టీ నాయకులలో ఒకరుమాత్రమేనని, ఆయన అంటే పార్టీ సభ్యులకు ఎంతో గౌరవాభిమానాలున్నాయని, సోషలిస్టు పార్టీని లోహియాపార్టీ అని పత్రిక వర్ణించడం సభ్యుణ్ణి, పార్టీని అగౌరవపర్చడమేనని అన్నారు.

కమ్యూనిస్టుపార్టీ నాయకుడు శ్రీ పి. సుందరయ్య, నాయకుడిపేరులో పార్టీని పిలవడం సబబైన పనికాదని పార్టీలన్నింటికి, వాటి విధానాలు కార్యక్రమాలు ఉన్నాయని, ఇవాళ ఒకరు నాయకుడు గాఉంటే, రేపు మరొకరు నాయకుడు కావచ్చని అన్నారు.

సభాపతి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, యిందులో హక్కులు భంగపరచడమనేది ఏమీ కన్పించడంలేదని, ఆ పత్రిక సభ్యుడి అభిప్రాయాలను గమనించి, ఇకముందు తగినట్లుగా వ్యవహరిస్తుందని ఆశిస్తున్నానని అన్నారు.

గౌరవసభ్యుడు హక్కుల తీర్మానం లేదలచుకొంటే లేవచ్చునని, సభాపతి చెప్పారు.

# అగ్నిప్రమాద బాధితులు

## సహాయం గురించి ప్రభుత్వ విధానం వివరణ

హైదరాబాదు, జూలై 8: అగ్నిప్రమాదాలవలన నష్టపడినవారికి తక్షణ సహాయంచేసే అధికారాలను తెలంగాణాలోకూడా రివిన్యూ డివిజనల్ ఆఫీసర్లకు ఇస్తామని ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి శ్రీ పి. వి. రాజేశ్వరరావుకు చెప్పారు.

ఇవ్వాళ శాసనసభలో శ్రీ మందపాటి నాగిరెడ్డిప్రశ్నకు సమాధానం ఇస్తూ 1955 లో 1750 అగ్నిప్రమాదాలు జరిగినట్లు ప్రభుత్వానికి తెలిసిందని అన్నారు. తాటిచెట్లు తాటాకులు గాకుండా అగ్నిప్రమాదాలవల్ల నష్టపడినవారికి ఏడులక్షల రూపాయల నగదు, 6 లక్షల విలువగల కలప సహాయంగా ఇచ్చారని తెలియజేశారు.

ఉపప్రశ్నలకు సమాధానంగా ప్రాజక్టు ప్రాంతాలలో అగ్నిప్రమాదాలు ఎక్కువగా వున్నాయనటం యదార్థం కాదనీ, అయినా శ్రీనాగిరెడ్డి అన్నట్లు నాగార్జునసాగర్ దగ్గర తరచుగా అగ్నిప్రమాదాలు సంభవిస్తున్నాయంటే ఆ విషయాన్ని ఈసారి ప్రాజక్టు నిర్వహణ మండలి సమావేశంలో పరిశీలించి అవసరమైన నివారణ చర్యలు తీసుకుంటామని ముఖ్యమంత్రి చెప్పారు.

శాసనసభ సభ్యులు ధృవపరచినంత మాత్రాన తగిన అధికార పరిశీలన లేకుండా అగ్నిప్రమాద బాధితులకు సహాయం ఇవ్వటానికి వీలులేదని కూడా ముఖ్యమంత్రి అన్నారు.

# దుమ్ముగూడెంలో ఉన్నత పాఠశాల

## ప్రభుత్వం నెలకొల్పదని మంత్రి ప్రకటన

హైదరాబాదు, జూలై 8: తూర్పు గోదావరిజిల్లా దుమ్ముగూడెం గ్రామంలో ప్రభుత్వం స్వయంగా ఉన్నత పాఠశాలను నెలకొల్పటానికి వీలుపడదని అక్కడ ఉన్న మాధ్యమిక పాఠశాల నిర్వహణ సంఘానికి తెలియజేశామని ఈ రోజు శాసన సభలో విద్యాశాఖ మంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావు శ్రీ మహమ్మద్ తహశీల్ ప్రశ్నకు సమాధానంగా తెల్పారు.

అయితే జిల్లా బోర్డుగానీ, ప్రైవేటు సంస్థలుగానీ ముందుకు వచ్చి ఉన్నత పాఠశాలను స్థాపించదలచినట్లయితే ప్రభుత్వానికి అభ్యంతరం లేదని కూడా మంత్రి వివరించారు.

# సంచార సినిమాలను అనుమతించే విధానం

హైదరాబాదు, జూలై 8: టూరింగ్ సినిమాలను గ్రామాలలో నెలకొల్పడానికి అనుమతిపత్రాలిచ్చే ముందు జిల్లా కలెక్టర్లు ఆయా గ్రామాల పంచాయతీ సంఘాలను సంప్రదిస్తారని అంతరంగిక శాఖ మంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డి ఇవాళ శాసనసభలో శ్రీ ఎం. నాగిరెడ్డి ప్రశ్నకు సమాధానంగా తెల్పారు.

గ్రామాలలో అనేకవర్గాలు కొందరివా దుంటారు కొబట్టి టూరింగ్ సినిమాలకు అనుమతి పత్రాలిచ్చే అధికారం మాత్రం పంచాయతీలకు ఇవ్వటం సాధ్యంకాదని మంత్రి వివరించారు.



Printed and Published for Nageswara Rao Estates (private) Ltd. by S. Radha Krishna, at the Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.